# ప ల్నా టి చ రి త్ర



క వి శా స్త్రో వి ద

రావిపాటి లక్ష్మీనారాయణ



**1953**

తొలికూర్పు

వెల రు 0-8-0

# విషయసూచిక

విషయము | పేజి
---|---



అనుబంధము 1.



అనుబంధము 2.



అనుబంధము 3.

# తొలిపలుకు

పల్నాటినిగూర్చిన హృద్యములగు శ్రీనాధునిపద్యము లును వీరరసవంతమగు పల్నాటివీరుల కథయు వినుటకింపుగా నుండును. పల్నాటిలోని యనేకప్రదేశముల నేనుచూచితిని. ఇందుపేర్కొనబడిన శాసనములలో కొన్నిటిని చూచితిని. కొన్నిటిని సూయల్ దార వ్రాసిన గ్రంథమునుండి గ్రహించి తిని. మెకంజీదార (Gordon mackenzie) 1888 లో వ్రాసిన కృష్ణాడిస్ట్రిక్టు మాన్యుయల్ లోని పల్నాటిలోని పురాతనవస్తువులు (Antiquities of Palnad TQ) యనునది యుందలి చరిత్రభాగమును వ్రాయుటకు కొంతవఱకు సహాయము చేసెను. చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసిన యాంధ్రుల చరిత్రయు, శ్రీనాధుడు రచించి అక్కరాజు ఉమాకాంతముగా రచోవ్యాఖ్యానించిన వీరచరిత్ర వీరుల కథాభాగము వ్రాయుటకు సహాయపడినవి. నాగార్జునకొండ, నందికొండ విషయమై యనేకులు పత్రికలలో ప్రకటించియుండిరి. పెందోట విషయమై విపులముగా కొండూరి వీరరాఘవాచార్యులుగారు భారతి 1951 ఏప్రియల్ నెలలో ప్రకటించిరి. నాగార్జునకొండచరిత్రను కరపత్రముల ముద్రించి వాని మూలమున ననేకపర్యాయములు ప్రకటించియుంటిని. అవిగాక భక్తి యోగప్రదర్శినియను మాసపత్రికలో 1934 డిశంబరు, 1935 జనవరి నెలలలోను భారతి 1938 జూన్ మాససంచికలోను, తెలుగు లారిపోర్టరులో 15-3-45 నను, ఆంధ్రప్రభ 1945 సంవత్సరము (తేదీజ్ఞాపకము లేదు) ప్రకటించితిని. ఇందలిచారిత్రక

భాగమును ఆంధ్రప్రభ 1945 సంవత్సరము ఆగష్టు నెలలో (తేదీ జ్ఞాపకములేదు) ప్రకటించితిని. తెలుగు లాండ్ పోర్టరు 1-9-45, 15-9-45, 1-10-45 పత్రికలలో చరిత్రభాగము వీరులకథాభాగము మున్నగునవి ప్రకటించితిని. వీరులకథా భాగమును, నాగార్జునకొండ చరిత్రను యీ సంవత్సరము (1953 లో) ప్రత్యేక పుస్తకముల మూలమున విపులముగా ప్రకటించితిని. కావున వానిని సంగ్రహముగా నిందు వ్రాసితిని. పై నావ్యాసముల సారాంశమును, నింకను తెలిసిన కొన్ని చరిత్రాంశములను గ్రంథరూపమున ప్రకటించు చున్నాను.

రావిపాటి లక్ష్మీనారాయణ





# పల్నాటి చరిత్ర



గుంటూరుజిల్లా తాలూకాలలోని కెల్ల పల్నాడు పెద్దది. వైశాల్యము 1050 చ. మైళ్లు. ఉత్తరమున 80 మైళ్లు. కృష్ణానది కలదు. కృష్ణ కావలియొడ్డున నైజాముకలదు. పల్నాటి నుండి శ్రీశైలమువఱకు నల్లమల కొండలును అడవులును వ్యాపించియున్నవి.

## చారిత్రిక విషయములు

పల్నాడు:-నాడు అనగా దేశములోకొంతభాగము. మన పూర్వులు దేశమును నాడులు, సీమలు మండలములుగా విభజించిరి. పల్నాడు, రేనాడు, పాకనాడు, వెలనాడు మొదలగునవి నాడులు. గుంటూరుజిల్లాలోని చందవోలు పరిసరప్రాంతమును (ప్రస్తుతము తెనాలి, రేపల్లె, బాపట్ల, తాలూకాలను) వెలనాడు అందురు. దానికి కమ్మనాడు అని నామాంతరము

కలదు. కొండవీడు మొదలు కందుకూరువఱకు (ప్రస్తుతము గుంటూరు, ఒంగోలు తాలూకాల్ను, సత్తెనపల్లి, నరసరావుపేట తాలూకాలలో కొంతభాగమును, నెల్లూరు కర్నూలు జిల్లాలలో కొంతభాగమును) గల ప్రదేశము పాకనాడు అందురు. ప్రస్తుతము పల్నాటి తాలూకానున్ను, సత్తెనపల్లి నరసరావుపేట వినుకొండ తాలూకాలలో కొన్ని గ్రామములను కలిపి పూర్వము పల్నాడనిరి. పల్నాటికి పలనాడు, పలినాడు పల్లెనాడు అని నామాంతరములు. పల్లవులు పాలించుటచే పల్లవనాడు అనుపేరువచ్చి తరువాత పలనాడుగను పల్నాడుగను మాఱినదని చిలుకూరి వీరభద్రరావుగారి యాంధ్రుల చరిత్రలో కలదు. పల్లవులు చాలదేశము పాలింపగ ఈ దేశభాగమునకు మాత్రమే ఈపేరెందుకు వచ్చెనో తెలియదు. పల్లెలుండుటచే పల్లెనాడు అని వచ్చినదనియు, అచ్చట దొరకు పాలరాతినిబట్టి పాలనాడు పలనాడు అనిన యింకినుబాగుండు ననియు (The name is derived from pallenadu land of hamlets. A more poletical derivation of Palnad is Palanad(milk land) from the light cream coloured marbles that abound there) అని కృష్ణా డిస్ట్రిక్టు మాన్యుయల్‌లో గలదు. పల్లుగానుండుటచే పల్లునాడయి పల్లు విల్లు ముల్లు శబ్దములబోలె పలునాడుగను, తరువాత పలనాడు పల్నాడుగను మాఱియుండునని శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారు వ్రాసిరి. మాచర్ల యాదిత్యేశ్వరాలయ శాసనములో 'పల్లిదేశ' మని కలదు. అమరావతి శాస

నములో "పలనాడు" అని కలదు. కారెమపూడి తూర్పువైపు నల్లాంచక్రవర్తుల శాసనములో 'పలినాటి' వారు అని కలదు. పూర్వకవులు "పల్లెనాడు" అని గ్రంథస్థముచేసిరి. శ్రీనాథుని చాటుపద్యములలో 'పల్లెనాటిసీమ పల్లెటూళ్లు' 'రసికుడు పోవ పల్నాడు' 'పన్నుగ పలినాటిసీమ ప్రజలందఱికిన్' 'పలినాటికి మాటికి పోవనేటికిన్' 'కారెమపూడి పట్టణము కాశిగదా పలినాటివారికిన్' అని కలదు. ప్రభావతీప్రద్యుమ్నములో పింగలి సూరన తనవారు 'పలనాటను పాకనాటనున్ ప్రసిద్ధులైనట్లు వ్రాసికొనినాడు.

వీరభద్రకవి సన్మానంబొప్ప నొసంగె పుత్రికకు పల్నాడైదు దేశంబులన్' అని పల్నాటి వీరభాగవతములో వ్రాసినాడు. ప్రబంధ పరమేశ్వర వేంకటేశ్వర విలాసములో 'పలనాటి గొల్లలపాటజాతి' యని గణపవరపు వేంకటకవి వ్రాసెను అప్పకవీయములో నప్పకవి "పల్లెనాటను నూటతొంబదియు నాల్గుగ్రామముల" అని వ్రాసెను. దొరకినదానిలోని కెల్ల పూర్వపుదియగు మాచర్ల యాదిత్యేశ్వరాలయ శాసనములో "పల్లిదేశ" మని యుండుటచే పల్లెలుండుటచే పల్లెనాడు పల్నాడు అని పేరువచ్చియుండును.

నాగులేరు:- పూర్వము నాగులనుజాతివారు నివసించుటచే నాగులేరను పేరు వచ్చెనందురు. 'నాగాధిపతి ప్రాణనాశంబుచేసి నమముగా బాఱిన నాగులేరా యెు!' యనియు 'తరువాత సర్పాఖ్యనటినిసీ గోపలను' అని శ్రీనాథు పల్నాటి

వీరచరిత్రలో చెప్పుటచే నాగుపామునుబట్టి నాగులేరను పేరు వచ్చియుండును.

చంద్రవంక:- ఇది 'చంద్రభాగా' యని మాచర్లలోని యాదిత్యేశ్వరాలయ శాసనములో బేర్కొనబడినది. మాచర్ల వీరభద్రస్వామి యాలయములోని యెఱ్ఱబండ శాసనము నందును 'చంద్రభాగ' యనికలదు. హిమాలయమునుండి ప్రవహించునదులలో నొకదానికి చంద్రభాగయని పేరుకలదు. పై శాసములబట్టి చంద్రవంకకుకూడ చంద్రభాగయని పేరున్నట్లు తెలియుచున్నది. మాచర్లవద్ద బాలచంద్రునివలె వంకరగాతిరుగుటచే చంద్రవంకయను పేరుగల్గెను.

గురజాల:- గురజాలకు గురివిందలయని మాధవీపురము అని ముదిగొండ వీరభద్రకవికృత వీరభాగవతమందు కలదు. మాధవియనగా గురివింద. గురివిందతీగెలను నటికి యూరుకట్టుటచే గురిజాలయని వచ్చెనందురు. వీరచరిత్ర లోను గురిజాల, గుర్జాలయని శ్రీనాథుడు వ్రాసెను. చాటు పద్యములలో గురజాల యిట్టకామేశహతాయనియు గురిజాలసీమ యనియు వ్రాసెను. వీరభద్రస్వామి యాలయము లోని శక 1470 శాసనములో గురిందల్ల గురిందలసీమయని కలదు.

మాచర్ల:- ఆదిత్యేశ్వరాలయ శాసనములో మహాదేవి తటాకమని మాచర్లకు వాడబడినది. మాచర్లవద్దనున్న మహాదేవి చెరువునుబట్టి యీపేరు వచ్చియుండును. వీరభద్రా

లయములోని మెట్లబండ శాసనములో మాచెర్లయని కలదు. వీరచరిత్రలో మాచర్ల మాచెర్ల యని శ్రీనాథుడు వాడెను. బ్రహ్మనాయుడు మలిదేవాదులతోగూడి నలగామునినుండి విడివడివచ్చుచు మజిలీచేసినచోటు కావున మాచర్లయని వచ్చెనని వీరచరిత్రలో కలదు. రెండవ ప్రతాపరుద్రునికి లోబడి మాచర్లసీమనేలిన మాచయనాయనిగారి పేరునుండి నైనను యాపేరు వచ్చియుండవచ్చును. మారేమదేలిన చోటు మాచర్లయనియు ఖగుడేలినది కారెమపూడియనియు దూషణు డేలిననది దుర్గియనియు, విశ్వామిత్రుడు సత్రయాగముచేసి నది సత్రశాలయనియు యందురుకాని యందులకుదగినదృష్టాంతములు లేవు. మాచమనాయనికి పూర్వపు శాసనములందు మహాదేవి చెరువనియు తరువాత శాసనములందును గ్రంథములందును మాచర్ల మాచెర్ల యనియు కలదు.

దుర్గాలయమునుబట్టి దుర్గియను పేరుగలిగెను. అల రాచమల్లుపేర మాచర్ల కాలుమైల్ల దూరమున రాచమల్లు పాడు (రచ్చమల్లెపాడు) కలదు. ఝెట్టిరాజుపేర తుమ్మకోటకు నాల్గుమైళ్ల దూరమున ఝెట్టిపాలెము (జెట్టిపాలెము) అలుగు రాజుపేర అలుగురాజుపల్లెయు, మలిదేవాదులపేర మల్లవరము కలవు. అనుగురాజు సముద్రస్నానమునకు బోయిన ప్పుడు దొడ్డనాయునిపేర నాయునిపల్లెయు, శీలాంబపేర చీరాలయు, పేర్నిపేర పేరాలయు కట్టించినట్లు వీరభద్రకవి వ్రాసినాడు.

**తుమ్మురుకోడు:-** ఇది కృష్ణానదికి మూడుమైళ్ల దూరమున నున్నది. గోల్కొండ నవాబుకు తన సామ్రాజ్యమునకు సరిహద్దుగానున్న **తుమ్మురుకోడు**వద్ద తిమ్మరుసు మంత్రిపేర రాయలొక కోటగట్టి కొంత సైన్యము రక్షణగా నుంచెను. అందువలన **నాగ్రామమునకు** తిమ్మరుసుకోట **యనియు** **తుమృకోడు** **యనియు** పేరువచ్చెనందురు.

నాయకురాలి కనుమ:- బాలచంద్రుని బోనీయక యిచ్చట నాయకురాలు వొంగచాచి నిలుచుండెననియు, బాలచంద్రుడుఖడ్గముచే కొండనునఱికి త్రోవచేసికొని పోయెననియు నందురు. కొండనిలువుగా నరికినట్లు గన్పించును. కొండశిఖరమునుండి బాలచంద్రుడు గుఱ్ఱమును దూకించినప్రదేశమును అచ్చటివారు జూపింతురు.

గుత్తికొండ బిలము:- యుద్ధమున చనిపోయినవారలను బ్రహ్మనాయుడు బ్రదికించి వెంటబెట్టుకొని గుత్తికొండబిలములో ప్రవేశించెననియు వారలు నిజరూపముల దైకొనిరనియు వీరభద్రకవి వ్రాసెను.

వీరుల గుడులు:- కారెమపూడిలో నాగులేటియొడ్డున గంగధార మడుగువద్ద నివికలవు. కొన్ని విడి స్తంభములు మండపములుకూడ కలవు. యుద్ధములో చనిపోయిన వీరుల పేర రాళ్లుకలవు. పల్నాటి యుద్ధానంతరము మహమ్మదీయుల కాలమున నొక గొప్ప సైన్యము దక్షిణమునుండి హైదరాబాదుకు పోవుచు కారెమపూడిలో నాగులేటియొడ్డున విడిసి

వీరుల లింగములను పొయిగడ్డలకు వాడుకొనగా సైన్యమంతయు మూర్ఛిల్లెనట. అంత నొకబ్రాహ్మణునిచే, తన యుపచారము తెలిసికొని వీరులకు గుడులు కట్టించునట్లు మ్రొక్కుకొనగా సైనికులు లేచిరట. అంత నతడాగుడులను కట్టించెనట. అతను వీరుల యందుభక్తిగలిగి వీరులశౌర్యములువినగనే నావేశముగలిగి యతడును యతని తమ్ముడును పొడుచుకొని చచ్చిరట. వారి గోరీలిప్పటికిని యున్నవి. పంచమకుల సంజాతుడైనయొకవీరునిగుడికూడ నిందు నిర్మింపబడియున్నది.

బాస్వెలుదొరవారి రిపోర్టులో "I may mention that lead is found in considerable quantities near Karempudı in Palnad but the mines are not worked. Copper is found both in Palnad and Vinukonda taluks" అని కలదు. గవర్నమెంటుకు బాస్వెలు దొరచేసిన రిపోర్టు 7-11-1870 తేదిగల G. O. (Act 1 of 1870) లో నచ్చుకాబడినది. పల్నాటిలోని కొన్ని గ్రామములలోనిను మాకరగిన పెద్దగొలుసులచిహ్నములు నిప్పటికి స్పష్టముగా గన్పించుచున్నవనియు గుత్తికొండలోని నొకభాగమునకు కొలుములపాలెమని పేరున్నదని యుఊమాకాంతముగారు వ్రాసిరి. గుత్తికొండవద్ద కొండను తుమ్మకోటవద్దకొండను నినుపకొండలని యిప్పటికి నందురు. గురిజాలలో సూరె కారపుడు ప్పును మప్పదిసంవత్సరములక్రిందటినట్టుచేయుచుండిరి. ఆచిహ్నము లిప్పటికిని స్పష్టముగా నున్నవి. Memoıs ofGeog:aphical survey of India vol 8 1 0 పుటలో

పల్నాటిలోని తుమృకోడువద్దను మల్లవరమువద్దను వజ్రపు గనులున్నట్లున్ను మొగలాయిరాజుల కాలమునందా గనులలో పనిచేయుచుండినట్లున్ను గలదు. కోహినూరు వజ్రమునకు పల్నాటిలోని నదీతీరప్రాంతమే జన్మస్థానమని యూహింపబడు చున్నది. చెన్నపట్టణమునుండి హైదరాబాదుకు పోవురోడ్డు పల్నాటిలోనుండిపోవును. అది తూర్పుయిండియా సంఘము వారిచే నిర్మింపబడినది. చెన్నపురినుండి హైదరాబాదునకు సైన్యములామార్గమునబోవుచుండెనట. దానినిదండుబాటయని పిలుతురు.

మేళ్లవాగువద్ద నాగులేటికి యానకట్ట కట్టి నీరు నిలువ చేసికొంతభూమిని మాగానిచేయుటకు వీలుకలదు. దాచేపల్లి వద్ద రాళ్లు భూమినుండి పైకిలేచి ఒకేమాదిరిగా వంగియుండును. అవిచూచుటకు చిత్రముగానుండును. గురజాలలో (పూర్వము గ్రామముండినచోట) నొకసంవత్సరము క్రిందట కొన్నిరాగినాణెములు దొరికినవి. అవి అనేకవందల సంవత్సరముల క్రిందటి నాణెములు. 1953 లో సెకండ్ గ్రేడు ట్రయినింగుస్కూలువార్షికోత్సవసందర్భముననవి(Exhibitionగా) ప్రదర్శింపబడినవి.

# పల్నాటినేలిన ప్రభువుల చరిత్ర



క్రీస్తునకు పూర్వము నాగులను జాతివారు పల్నాటిలో నుండిరి. ఆంధ్రదేశములో బౌద్ధమతము వ్యాపించిన పిమ్మట బౌద్ధశాసనములు పాళీ భాషలో నున్నవి. గురజాలలో రెంటచింతలపోవు రోడ్డునానుకొని కోటసాని దిగుడు బావివద్ద పాళీభాషలోని యొకశాసనముకలదు. నాగార్జునుని కాలమున ననగా రెండవశతాబ్దాంతమున పల్నాడు ఆంధ్ర ప్రభువులగు శాతవాహన వంశపురాజుల క్రింద నుండెను.

అప్పుడేలురాజునకు బంధువగు చాంతిశ్రీయను రాచకుమారి ప్రోత్సాహముచే నాగార్జునకొండలోని స్తూపము కట్టబడినట్లు నాగార్జునకొండలోని పాళీభాషలోగల శాసనమునుబట్టి తెలియుచున్నది. ఆంధ్రులు నాలుగువందల సంవత్సరములు పాలించిరి. వారిరాజ్యము 'కంచి' (కాంచీపురము) మొదలు మగధ (బీహారు) లోని పాటలీపుత్రము (పాట్నా) వఱకును. తూర్పుపడమరల నుభయసముద్రముల వఱకును వ్యాపించెను. వారు ఈజిప్టు, రోము మున్నగు దేశములతో వ్యాపారముచేసిరి. నాగార్జునకొండలో కొన్నిరోమాయనాణెములు దొరకినవి. ఆంధ్రులనాణెములమీద "ఓడ" ముద్రింపబడినది. (వానిని నేనుచూచితిని) వారలకు కొంతకాలము అమరావతియు, కొంతకాలము అమరావతికి వాయవ్యదిక్కున మూడు

మైళ్లదూరమునందు ధరణికోట (ధాన్యకటకము) ముఖ్యపట్టణములుగా నుండెను. మూడవశతాబ్దములో నిక్ష్వాకులు పాలించిరి. ఇక్ష్వాకుల నాణెములుకొన్ని నాగార్జునకొండలో దొరకినవి. అటుపిమ్మట పల్లవులు పాలించిరి. పల్లవులపిమ్మట చోళులు పల్నాటిని పాలించిరి. గురజాలలోని యిష్టకామేశ్వరాలయము చోళులకాలమునాటిదని ప్రతీతి. కొన్ని శాసనములలోని ప్రభువుల పేర్లలో కన్నడపుపేరులు గాన్పించుటచే కన్నడదేశపు రాజులు చోళులపిమ్మట పల్నాటి నేలినట్లు తెలియుచున్నది. ఆపిమ్మట చాళుక్యులు పాలించిరి. చాళుక్యప్రభువులలో చాలమందికి పేరులచివర ఆదిత్యుడని యుండును. (విజయాదిత్యుడు, గుణగాదిత్యుడు, విమలాదిత్యుడు మొదలగునవి.) అట్టి ఆదిత్యులలోనొకనివలన మాచర్లలోని యాదిత్యేశ్వరాలయము నిర్మింపబడినది. అది శివాలయము. ఆదిత్యనిర్మిత దేవప్రాసాదమని శాసనములోనున్నది. దానికి బాగిబేతరాజు అను ప్రభువు క్రీ॥ శ॥ 1111 లో భూదానము చేసెను. అటుపిమ్మట వెలనాటిప్రభువు ధవళశంఖునిక్రింద పల్నాడుండెను. దానికి చందవోలు ముఖ్యపట్టణము. అతనుతనకూతురునకు పల్నాటి అరణముగా వివాహవేళనిచ్చెను. అంతటనుండి పల్నాటివీరులు పాలించిరి. వీరు హైహయవంశజులు. వీరిని గళచురి రాజులందురు. రేవా (నర్మదానది) ప్రాంతమునగల పాలమాచాపురి (జబల్పూరు) నుండివచ్చిరి. వీరిలోపల్నాటి నేలినది అలుగురాజు, నలగామరాజు మలిదేవాదులు. పల్నాటి యుద్ధము క్రీ॥ శ॥ 1180 ప్రాంతమున జరిగెను. ఆకాలమున

వరంగల్లు నేలుచున్న కాకతీయప్రభువగు మొదటి ప్రతాప రుద్రుడు నలగాముని సహాయార్థము 1000 గుఱ్ఱపుసైన్యమును బంపెనని పల్నాటి వీరచరిత్రలో కలదు. నాయకురాలు సంధికై బ్రహ్మనాయునివద్దకు పంపిన రాయబారి కోటకేతువు ధరణికోటరాజు. ఇతడు శ. క॥ 1104 (1182 A. D లో)- రాజ్యమునకువచ్చినట్లు అమరావతి శాసనములో నున్నది. నలగామునకు సహాయము కొఱకు సైన్యములు పంపినవారిలో (రెండవ) వీరభల్లాణుడు కలడు. ఇతడు ద్వారసముద్రము రాజధానిగ క్రీ. శ. 1173 మొదలు 1224 వఱకు రాజ్యమేలెను. వీరచరిత్రలో వెలనాటి చోడునుకూడ నుదహరింపబడినాడు. ఇతని యసలుపేరు రాజేంద్రచోడు డైనట్లును క్రీ. శ. 1158 మొదలు 1200 వఱకు పాలించినట్లును తెలియుచున్నది. అలుగురాజు నలగామురాజుల కాలములో ననేకచోట్ల చెరువులు త్రవ్వంబడినవి. ఆలయములు బాగుచేయబడినవి. మాచర్ల చెన్నకేశవాలయమును బ్రహ్మనాయుడు బాగుచేసి పెంపుచేసెను. పల్నాటివీరుల పిమ్మట యనగా 13 వ శతాబ్దమున పల్నాటిని పద్మనాయకులు పాలించిరి. కనిగిరిసీమ ప్రభువగు కాటమరాజునకును నెల్లూరిప్రభువగు మనుమసిద్ధి రాజునకును పసువుల పుల్లరివిషయమై యుద్ధముజరిగెను. ఖడ్గ తిక్కన మనుమసిద్ధిరాజువద్ద సేనానిగానుండెను. పల్నాటి పద్మనాయకులు కాటమరాజునకు యుద్ధమునందు సహాయము చేసిరి. (కాటమరాజు కథలచ్చు టచ్చట పల్నాటిలోకలవు.

పశువుల విషయమై యాపదలు వచ్చినప్పుడీ గుడులకు (మొక్కుకొందురు.) మనుమసిద్ధిరాజు యుద్ధమునందోడెను. కాటమరాజు నెల్లూరి నాక్రమించెను. మనుమసిద్ధిరాజుకు మంత్రియు నాస్థానకవియునగు తిక్కనసోమయాజి వరంగల్లు నకుబోయెను. కాకతీయచక్రవర్తియు మొదటి ప్రతాపరుద్రుని కుమారుడునగు గణపతిదేవుడు అప్పుడు వరంగల్లునేలుచుండెను. గణపతిదేవునివద్దగల బౌద్ధులను జైనులను తిక్కనసోమయాజి వాదమునందుగెలిచి గణపతిదేవునిమెప్పుబొందెను. తిక్కనకోరికపై మనుమసిద్ధిరాజు సహాయమునకై గణపతి సైన్యమును బంపెను కాటమరాజు నెల్లూరివిడచి పారిపోయెను. మనుమసిద్ధిరాజు నెల్లూరికి ప్రభువయ్యెను. పల్నాడు కాకతీయ సామ్రాజ్యములోనికి వచ్చెను. అనగా పల్నాటియుద్ధము జరిగిన 50 సంవత్సరములకు పల్నాడు గణపతిదేవునిక్రిందకు వచ్చెను

## కాకతీయుల పాలన

కాకతీయుల కాలమునాటి దానశాసనములు పల్నాటిలో చాలగలవు శాసనములందు. శాలివాహన శకమే కాకుండ కాకతీయ చక్రవర్తుల పేరులు సహితము పేర్కొనబడినవి. మాచర్లకోట్ల వంతెనవెంబడి చంద్రవంకయొడ్డున పాడుపడిన గుడివద్దనున్న శాసన మట్టివానిలో నొకటి. గణపతిదేవుడు క్రీ॥ శ॥ 1260 వరకు రాజ్యమేలెను. అతని కాలమున నతనిమంత్రులలోనొకడు రాష్ట్రపాలకులలో నొకడునగు సాహిణి గంగయ్యక్రింద పల్నాడుండెను. గణపతిదేవుని పిమ్మట

అతనికుమార్తెయగు రుద్రమదేవి కాకతీయరాజ్యమేలెను. ఆరాణి కాలమున యామిరాష్ట్రపాలకుడగు జన్నిగదేవరాజు క్రింద పల్నాడుండెను. ఈజన్నిగదేవరాజు సాహిణి గంగయ్యకు మేనల్లుడు. ఈజన్నిగదేవునికాలమున కారెంపూడిలోని సురేశ్వరాలయమునకు గోపుర ప్రాకారములు కట్టబడినవి. దుర్గిలోని శ. క. 1191 (1269 A. D) శాసనములోను కారెంపూడి శ॥ క॥ 1186 (1264 A D) శాసనములోను జన్నిగదేవరాయని పేరు పేర్కొనబడినది. జన్నిగదేవరాయల పిమ్మట త్రిపురాంతకదేవుడు రాష్ట్రపాలకుడుగానుండెను. అతనిక్రింద పల్నాడుండెను. దాచేపల్లిలోని శ. క. 1135 (1213 A. D.) నాటిశాసనమునందు త్రిపురాంతకదేవుని పేరు చెప్పబడినది. రుద్రమదేవి పిమ్మట నామెమనుమడగు రెండవ ప్రతాపరుద్రుడు వరంగల్లునకు ప్రభువయ్యెను. అతనికాలముననే కాకతీయరాజ్య మంతరించెను. అతనికి మంత్రి ప్రసిద్ధికెందిన యుగంధరుడు. అతనికాలమున నతని రాష్ట్రపాలకుడును మంత్రియునగు సాహిణి మాచయసేనాని క్రింద పల్నాడుండెను. ఇతడు క్రీ॥ శ॥ 1311 సంవత్సరమున గురజాల, పింగళి స్థలములు చేరియున్న పలినాటి సీమ కధికారియని కోన వెంకటరాయశర్మగారు వ్రాసిన దండనాథులను పుస్తకములో నున్నది ఇతడు మహాదేవిచెర్ల స్థలమును (మాచర్ల) నేలుచుండినట్లు మాచర్లలోని శ. క. 1236 (1314 A. D) నాటి శాసనములోనున్నది. ఇతని పేరు శ. క. 1229 (1307 A. D) నాటి కారెంపూడి శాసనములోనుదాహరింపబడియున్నది.

ఇతనినిబట్టియే మహాదేవిచెర్వు పట్టణమునకు మాచెర్లయని పేరువచ్చియుండవచ్చును. తంగెడకోటను ఉప్పల అనుముల మాంచిరెడ్డి యనునతడు కట్టించినట్లు తెలియుచున్నది.

కాకతీయులపిమ్మట కొండవీటి రెడ్డిరాజుల క్రిందకు పల్నాడువచ్చెను. కొండవీటి రెడ్డిరాజులు ఒరిస్సాకు ప్రభువు లగు గజపతులకు సామంతులుగ నుండిరి. కొండవీటి రాజ్యమునగల 14 సీమలలో పల్నాటిసీమ యొకటి. పల్నాటిసీమలో గురజాలసముతు మాచర్లసముతు తుమురుకోడుసముతు తంగెడసముతు కారెంపూడిసముతు యని నైదుసముతులుండెను. దాచేపల్లిలోని పాడుపడినకోట కొండవీటి రెడ్డిరాజులచే గట్టబడినది. కొండవీటిచరిత్రము కొండవీటి దండకవిలె వలనను, మల్లపల్లి గురుబ్రహ్మశర్మగారు వ్రాసిన కొండవీటిసామ్రాజ్యము గ్రంథమువలనను తెలియనగును. కొండవీటిరెడ్ల యాస్థానకవి యగు శ్రీనాథుడు పల్నాటిలో ననేకపర్యాయములు తిరిగి మనోహరములగు పద్యములు చెప్పెను. పల్నాటి వీరగాథను ద్విపదకావ్యముగా రచించెను. అనగా యుద్ధముజరిగిన 300 సంవత్సరములకు మొదటిసారి (ద్విపదగా) వీరగాథ రచింపబడెను. కొండవీటిని కృష్ణదేవరాయలు క్రీ. శ. 1516 లో గెలిచెను. అప్పుడు పల్నాడుకూడ విజయనగర సామ్రాజ్యములోనికి వచ్చెను.

## విజయనగర రాజుల పాలన

పారిజాతాపహరణము నందు నంది తిమ్మన "సీ॥ ఉదయాద్రివేగ నత్యున్నతిసాధించె । వినుకొండమాట మాత్రన

హరించె । గూటముల్ సెదరంగ కొండవీడగలించె । బెల్లము కొండ యచ్చెల్ల జెఱచె” నని పల్నాటినానుకొనియున్న విను కొండ బెల్లముకొండ దుర్గములను కృష్ణదేవరాయలు గెలిచెనని వర్ణించెను. కృష్ణదేవరాయని శాసనములు శ. క. 1440 (1518 A. D.) పల్నాడులోను కలవు. పల్నాడు శివారు రామడక అను గ్రామమును మాచర్ల చెన్నకేశవ స్వామివారికి సమర్పించినట్లు పల్నాటి శాసనములో నున్నది, అనగా రాయలస్వాధీనమైన రెండుసంవత్సరముల కీదానము జరిగినది. ధరణికోట శాసనములో అద్దంకి, వినుకొండ, బెల్లము కొండ, నాగార్జునకొండ, తంగెడ, కేతవరము, మొదలగుదుర్గ ములను రాయలు గెలిచెనని కలదు. అహోబల శాసనములో వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, అద్దంకి, అమ్మన బ్రోలు, తంగెడ, కేతవరము మొదలగు దుర్గముల రాయలు గెలిచెననికలదు. కృష్ణదేవరాయలపాలనమునందు క్రీ.శ. 1518న నతని రాష్ట్రపాలకుడగు యల్లవినాయంకరు మక్కాతిమ్మరు నాయంకరు పాలనముక్రింద పల్నాడుండినట్లు పల్నాటి శాసన మువలన తెలియుచున్నది. క్రీ. శ. 1526 యందు కృష్ణదేవరా యలరాష్ట్రపాలకుడగుకోనపనాయనింగారిక్రింద పల్నాడుండినట్లు మాచర్ల శాసనమువలన తెలియుచున్నది. మాచర్ల వీరభద్రా లయములోని మెట్టబండ శాసనమునందు సదాశివ రాయలు విజయనగరసామ్రాజ్యము పాలించుచుండగా ఆ సామ్రాజ్యము నకు లోబడి నాగార్జునకొండ సీమను పాలించు ప్రభునగు

తిమ్మానాయనింగారిభార్య లింగాంబ తనపేర లింగాపురమను గ్రామము కట్టించి వీరభద్రస్వామికి సమర్పించి నట్లున్నది. ఈ దానశాసనము ననుసరించి యిప్పటికిని యీలింగాపురము వీరభద్రస్వామివారి కైంకర్యమునకు వినియోగపడుచున్నది.

సదాశివరాయలు క్రీ. శ. 1542–1563 వఱకు పాలించెను. ఆకాలమున మాచర్లప్రాంతము నాగార్జునకొండసీమయని వ్యవహరింపబడుచుండెననియు, దానికి తిమ్మానాయనింగారను వారు రాష్ట్రపాలకుడుగా నుండెననియు తెలియుచున్నది. గురజాలలో వీరభద్రస్వామి యాలయములో నాగుపాములు చిత్రింపబడిన రాతిస్తంభపు శాసనముమీద తిరుమలదేవరాయనికాలపు శాసనమున్నది. కాబట్టి క్రీస్తుకుపూర్వము రెండు పిమ్మట రెండు శతాబ్దములందు ఆంధ్రరాజులు, 3 వ శతాబ్దమున ఇక్ష్వాకులు, 4, 5, 6, 7, 8, శతాబ్దములందు పల్లవులు, 9, 10 శతాబ్దములందు చోళులు, 11 వ శతాబ్దమున చాళుక్యులు వెలనాటిచోళులు, 12 వ శతాబ్దమున పల్నాటివీరులు పద్మనాయకులు, 13, 14, శతాబ్దములందు కాకతీయరాజులు, 14, 15 శతాబ్దములందు కొండవీటి రెడ్డిరాజులు, 16 వ శతాబ్దమునందు విజయనగర ప్రభువులు పాలించిరి.

## మహమ్మదీయపాలన

విజయనగర సామ్రాజ్య మంతరించగనే పల్నాడు క్రీ. శ. 1565 ప్రాంతమున గోల్కొండనవాబు వశమయ్యెను. నాగార్జునకొండకు పదిమైళ్లు దక్షిణముగా కృష్ణాతీరమున

పెందోటయను పట్టణముండెను. దానిని ధవళేశ్వరపుమార్కం డేయుడను విశ్వబ్రాహ్మణప్రభువు పాలించెను. ఇతడు 1585 A. D. ప్రాంతమున నుండెను. అప్పుడు గోల్కొండను పాలించుచున్న మహమ్మద్ కుతుబుశాహికి మంత్రియై, సామంతుడై యతని రాజ్యవిస్తరణకు తోడ్పడెను. కుతుబుశాహి క్రీ. శ. 1580 నుండి 1611 వఱకు పాలించెను. తురాకు రాజ కవి, అయ్యంకి బాలసరస్వతి యను నియుక్త కవుల పోషించి ఈ మార్కండేయప్రభువు స్కాందపురాణములోని నాగర ఖండమును వారిచే తెలుగుచేయించి కృతినొందెను. క్రీ శ. 1660 ప్రాంతమున నుండిన అప్పకవి తనగ్రామమగు కామేపల్లి సాయప వేంకటపతి భూనాయకునిచే నీయబడినదని వ్రాసికొనెను. అప్పకవి కాలములో పల్నాటిలో 194 గ్రామము లుండెనని 'పల్లెనాటను నూటతొంబదియునాల్గు గ్రామముల' అను అప్పకవీయములోని పద్యమువలన తెలియుచున్నది. (కొండవీటి రెడ్లకాలమున 150 గ్రామములున్నట్లు తెలియుచున్నది. ఇప్పుడు శివారులతోకలిపి 133 గ్రామము లున్నవి.) గోల్కొండనవాబు పిమ్మట పల్నాడు ఆర్కాటు నవాబుక్రిందికివచ్చెను. 18 వ శతాబ్దిప్రారంభమున రామరాజు మంత్రిప్పదేశాయి యనునతడు పల్నాటికి దేశముఖుడు (దేశ వ్యవహర్త) ఆయెను. అతని మనుమడు వీరభద్రయ్య వరుసగా 34 సంవత్సరములు పల్నాటికి దేశముఖుడుగా నుండెను. ఆర్కాటునవాబగు మహమ్మదాలీఖాన్ క్రీ. శ. 1764 లో వీర

భద్రయ్యను తొలగించెను. అప్పుడు పల్నాడు ఉత్తరసర్కారులలో లేదు. పల్నాడు, ఒంగోలు తాలూకాలుతప్ప మిగిలిన గుంటూరుజిల్లా మాత్రమే యుత్తరసర్కారులలో నుండెను. ఒంగోలు నెల్లూరితో బాటు పల్నాడు ఆర్కాటునవాబుక్రింద నుండెను. ఆర్కాటునవాబు తనరాజ్యమును కొన్నిభాగములుగ విభజించి తనకురావలసినశిస్తును తనసభలో ప్రతిసంవత్సరము వేలము వేయుచుండెను. ఎక్కువపాట పెట్టినవాడు పాట మొత్తమును నవాబుకుచెల్లించి పాటపెట్టిన గ్రామములలోని ప్రజలనుండి శిస్తువసూలు చేసికొనుచుండెను. తుమ్మకోడులో కొంతసైన్యముతో బాటు నొక ఫౌజుదారుని నెలకొల్పెను. 1766 నుండి ఈస్టుఇండియాకంపెనివారి సైన్యముకూడ కొంత తుమ్మకోడులో నుండెను. తుమ్మకోడులో చనిపోయిన ఆంగ్లేయ సైనికోద్యోగుల సమాధులలో ఆర్కాటునవాబగు (కైవుకాలమందలి) మహమ్మదాలిపేరు నమోదుకాబడినది. 24-2-1787 న యుతరజిల్లాలతో బాటు పల్నాటినికూడ నవాబు కంపెనివారికి తాకట్టుపెట్టెను. 1790 జులై నెలలో కంపెనివారి పాలన ప్రారంభమయ్యెను.

## ఆంగ్లేయుల పరిపాలన



పల్నాటికిని ఒంగోలునకును కలిపి (Erskine) యిర్స్కిన్ యనునతని కలెక్టరుగా కంపెనివారు నియమించిరి. తుమ్మకోడులో నొక డిప్యూటి తహసీలుదారుకుండెను. 1793 లో

కృష్ణనుదాటి నైజామునుండి వేయిమంది సిపాయిలు ఒంది పోటు దొంగలుగావచ్చి కంపెనివారి సైన్యమును చంపి దేశమును దోచుకొనిరి. వినుకొండనుండి కంపెనివారి సైన్యము వచ్చి వారిని పాఱదోలెను. 1801 లో ఆర్కాటునవాబు పల్నాటిని కంపెనివారికిచ్చెను. 31-7-1801 (scot) స్కాటు యనునతడు కలెక్టరాయెను. 1816 లో పిండారీలు అమరావతివద్ద కృష్ణనుదాటి దేశమును కొల్లగొట్టుచు గుంటూరు నరసరావుపేట వినుకొండ మీదుగా కంభముకు పోయిరి. గుంటూరిని పిండారీలు దోచుకొనిరి. పిండారీలలోని యొక గుంపును నరసరావుపేటజమీందారుడగుగుండారాయుడు కోటప్పకొండవద్దజయించెను. 1832-33 (నందన) సంవత్సరమందు గుంటూరు కృష్ణాజిల్లాలకు పెద్దకఱవువచ్చెను. దానిని డొక్కలకఱవందురు. అప్పుడు రైలుమార్గములు లేనందున గోదావరి ప్రాంతము పండినను ఆ ధాన్యమిచ్చుటకు వచ్చుటకు వీలు లేక కఱవుచే ప్రజలుబాధపడిరి. 1859 డిశంబరులో గుంటూరు మచిలిపట్టణము జిల్లాలనుకలిపి కృష్ణాజిల్లాగ చేర్చిరి. దరిమిలా గుంటూరు కృష్ణాజిల్లాలు వేఱయ్యెను. ధాతకఱవు (1876) లో ప్రజలు బాధపడిరి. తహసీలుదారు ఆఫీసు దాచేపల్లినుండి గురజాలకు మార్చబడెను. కారెమపూడిలో పల్నాడు వినుకొండ నరసరావుపేట తాలూకాలకు నొక మునసబుకోర్టుండెను. దానిపై యప్పీలుచేయుటకు బందరులో జడ్జికోర్టు ఉండెను. యూరోపియనులు డిస్ట్రిక్టు మునసబులుగను జడ్జిలుగనుండిరి. వైటుదొర (white) డిస్ట్రిక్టుమునసబుగా నుండినప్పుడు 1895

ప్రాంతమున మునసబుకోర్టు కారెమపూడినుండి నరసరావుపేటకు మార్చబడెను. గుఱ్ఱపుబండ్లు అంచెలుగా నేర్పడి వానిమీాద ప్రయాణములు చేయుచుండిరి. ఇప్పటికి 50 సంవత్సరములక్రింద దైదవద్ద కృష్ణానదికి ఆనకట్ట కట్టవలయునను నుద్దేశ్యముతో సర్కారువారు యీతాలూకాను కొలిపించి ప్లానులు తయారుచేయించిరి. కృష్ణవద్ద నొక బంగళానుకట్టిరి. తరువాత నాప్రాజెక్టును మానుకొనిరి ఆబంగళా యిప్పటికిని యున్నది. 1915 ప్రాంతమున మోటారు బస్సుసర్వీసు యేర్పడెను. 1920 లో అసహాయోద్యమ సందర్భమున ప్రభుత్వసైనికులచే జంగమహేశ్వరపురము, పొందుగుల, రామాపురం మొదలగు చోట్ల నల్లరులుజరిగెను. పుల్లరిని కట్టవద్దని ప్రచారము చేసిన కన్నెగంటి హనుమంతు యనునతను మించాలపాటివద్ద కాల్చబడెను. 3-1-1927 న గురజాలలో మునసబుకోర్టు యేర్పడెను. 1928 లో నాగార్జునకొండ విషయము బయలుపడెను. 1929 లో పల్నాటికి రైలుమార్గమేర్పడెను. 1937 లో గోపన్న యనునతనిచే గురజాలలో మూడున్నరరూపాయలకు 15 రోజులలో నాలుగురూపాయ లిచ్చునట్లు కంపెనియేర్పడి ముప్పదిలక్షల రూపాయలవఱకు వ్యాపారము చేసి ప్రజలను నష్టపఱచెను. పల్నాటికి మొదటిహైస్కూలు గురజాలలో నేర్పడెను. దరిదాపు చాలగ్రామములందు హైస్కూళ్లు నేర్పరచిరి. 1937 లో కావూరి వెంకయ్యగారిచే గురజాల హరిజన వసతిగృహమేర్పడెను. అది దినదినాభివృద్ధిచెందు

చున్నది. 1939 లో ప్రారంభమైన రెండవ ప్రపంచయుద్ధము 1945 లో అంతమయ్యెను. 15-8-47 న మనదేశమునకు స్వాతంత్ర్యము వచ్చెను. 1948 లో నైజాములో జరిగిన రజాకార్ల యల్లరుల మూలమున చాలమంది నైజాముప్రజలు పల్నాటిలో తలదాచుకొనిరి. 26-1-50 న మనదేశము రిపబ్లిక్ ఆయెను. 1950 లో కమ్యూనిస్టుల యల్లరుల మూలమున పల్నాటిప్రజలు బాధపడిరి. ఆహారవస్తువులమీదను, వస్త్రములమీదను యుద్ధకాలమున పెట్టబడినకంట్రోళ్లను స్వాతంత్ర్యము వచ్చినను తీసివేయనందున, ఇతరప్రాంతములందలి ప్రజలతో బాటు పల్నాటిప్రజలుకూడ బాధపడిరి. 1952 లో కంట్రోళ్లు తొలగింపబడెను. ఆసంవత్సరమే గురజాలలో సెకండరీగ్రేడు ట్రయినింగుస్కూలు యేర్పడెను.

---

## పల్నాటి కవులు

---

1. పింగళి సూరన:- పింగళి సూరన గరుడపురాణమును తెనిగించెను. రాఘవపాండవీయమను శ్లేషకావ్యమును, కళాపూర్ణోదయమను నద్భుతకావ్యమును, ప్రభావతీప్రద్యుమ్నమును రచించెను. ఇతడు నియోగిబ్రాహ్మణుడు. గౌతమగోత్రుడు. 16 వ శతాబ్దమువాడు. ఇతడు క్రీ. శ 1566 వ సంవత్సరప్రాంతమున నుండెనని కంకనాలిపి శిలాలింగముగాను నిర్ధారణ చేసిరి. కృష్ణదేవరాయలు 1509-1530 వఱకు రాజ్యమేలెను

పింగళి సూరనగాని రామరాజ భూషణుడుగాని, కృష్ణదేవరాయల కే గ్రంథమును అంకితముచేయని కారణముచేత రాయల యాస్థానములో నీరు లేరనియు, తరువాత నుండిరనియు కొందఱి వాదము. అష్టదిగ్గజకవులలో వీరి పేర్లుకూడ నుండుట చేతను, నారీతిగా ననేకచాటుపద్యము లుండుటచేతను కృష్ణదేవరాయల చివరిసంవత్సరములలో వీరిద్దఱు చేరిరనియు, అల్లసాని పెద్దన, తెనాలి రామకృష్ణాదులు పెద్దవారలుగా నుండినప్పుడు పిన్నలుగా వీరిద్దరు రాయలవద్ద కవులలో నుండిరనియు, రాయలయనంతరము వీరిద్దఱు గ్రంథముల రచించి రాయల తరువాతి రాజుల కంకితముచేసిరనియు కొందరివాదము. ఇతడు రాఘవ పాండవీయమును ఆకువీటి పెద వేంకటపతి భూపాలునకును, కళాపూర్ణోదయమును నంద్యాల కృష్ణభూపతికిని నిచ్చెను. తాను గోకనమంత్రి వంశజుఁడననియు పింగళి యను గ్రామమున దన పూర్వులు చిరకాలముండుటచే పింగళియను పేరువచ్చినదనియు, ప్రభావతీ ప్రద్యుమ్నములో

మ॥ తరముల్ నాల్గయి దొంటి నెందుఁదగుదత్తగ్రామ నామంబులం
బరఁగున్ వంశములెల్ల పూర్వపునిజప్రఖ్యాతి మాయంగ నే
మరుదో పింగళినామమందు చిరకాలావాసులై యున్న సు
స్థిరతన్ గోకనమంత్రివంశజులకుం జెన్నొందు మిన్నందుచున్

అనియు, సూర్యునివరముచే వారి సంతతి శాఖోపశాఖలై యన్నిప్రాంతములందు ప్రబలినదనియు, వ్రాసినాఁడు. పింగళి సూరన గ్రామము పల్నాటిలోని పిన్నెలి. ఇందులకాధారములు. పింగళియను గ్రామమాంధ్రదేశమున నెచ్చటను లేదు.

పల్నాటిలోని పిన్నలికి పింగళియను నామముకలదు. అప్పకవి క॥ తంగెడసీమను నిర్జర। గంగానను నాగనిమ్నగా పూర్వ దిశన్। పింగళిపుర దక్షిణమున। రంగుగ నెలకొన్న గోప రత్నంబునకున్ అని పిన్నెలిని పింగళియని వ్రాసినాడు. (2) ప్రభావతీ ప్రద్యుమ్నములో

ఉ॥ రంగుగ గౌతమీ పగిదిరంబుల కృష్ణకెలంకులన్ ఘనుల్
పింగళి రామయాదులు లలిం బలనాటను బాకనాటనున్
బింగళి గాదయాదులిట పెంపువహించిన యస్మదాదులా
పింగళి గోకమంత్రి యిలుపేరనె చాలప్రసిద్ధి కెల్లచోన్

అని తనవారు పలనాటిలో ప్రసిద్ధులైనట్లు వ్రాసికొనినాడు. (3) ప్రభావతీ ప్రద్యుమ్నములో సూరన

ఉ॥ "పేర్వెలయంగ నాఘనుడు పింగళిగోకబుధోత్తముండు గం
ధర్వనొకర్తు బేకియనుదాసిని దాసిగ నేలె" యని తన

పూర్వుని గుఱించి వ్రాసినాడు. ఈ పేకికథ పిన్నెలివారింటిలో నిప్పటికిని వంశపరంపరగా చెప్పుకొనబడుచున్నది. పిన్నెలివారి పూర్వులలో నొకరింట పేకియను గంధర్వి మనుష్యవేషమున దాసిగానుండెననియు, దూరముగానున్న దీపమునకు త్రోయుటకు సూతికాగృహముననున్న యజమానురాలిచే నాజ్ఞాపింప బడెనదనియు, అది లేచుటకు బద్ధకించి, యెవరు తనను జూడ లేకరాయని తలచి, గంధర్వమాయచే నాలుకను దీపము వఱకు చాచి ఎగద్రోసెననియు దీనిని చూచిన యజమానురాలు భయపడి భర్తకు చెప్పి దాసిని వెడలగొట్టించెననియు

పిన్నెలిలోనివారు వృద్ధపరంపరగ చెప్పికొనెదరు. (4) పిన్నెలి ప్రాంతమును పూర్వము పింగళుడను రాక్షసుడేలినాడనియు అందువలన పింగళియను పేరువచ్చెననియు నచ్చటివారనెదరు. రాక్షసగుడులనుపేర చిన్నగుడులు పిన్నెలివద్ద నిప్పటికినియు న్నవి. (5) కందుకూరి వీరేశలింగముగారు కవులచరిత్రలో సూరనగారి గ్రామమగు పింగళి కృష్ణామండలమున నున్నదని వ్రాసినాడు. ఆకాలమున గుంటూరు కృష్ణజిల్లాలుకలిసి కృష్ణా మండలము (కృష్ణజిల్లా)గ నుండుటచే పింగళిగ్రామము పల్నా డులోని పిన్నెలి యగును. (6) సూరన హాస్యమునకై తెనాలి రామలింగనిమీద కం॥ తెన్నాలి రామలింగడు । తిన్నాడే తట్టెడంత యని వ్రాయగా రామలింగడు 'తీయని బెల్లం । బన్నగ దీనిని వ్రాసిన । పింగళి సూరన్ననోట ... (పేడే) పడెరా॥ యని పూర్తిచేసెనని చాటుపద్యముకలదు. ఈపద్యముయొక్క నిజమెట్లున్నను, నిది చాలకాలమునుండి ప్రజలలో చెప్పుకొన బడుచున్నది. ఈపద్యమునందు పింగళి సూరన్నకు బదులు పిన్నెలిసూరన యనిన ప్రాసభంగము గాకుండును. కావున పిన్నెలియే పింగళియగును. కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వ తత్త్వవిచారములో పింగళిసూరన కవిత్వమును ప్రశంసించిరి.

(2) రామరాజభూషణుడు
(3) మూర్తికవి
} పెద్దనకు వేర్వేరు కవులు. భట్రాజులు పల్నాడుతాలూకా భట్రాజుపల్లె వీరిగ్రామము.




రామరాజభూషణుడు వసుచరిత్రమును, హరిశ్చంద్రనలోపాఖ్యానమను ద్వ్యర్థి కావ్యమును రచించెను. వసుచరిత్రను తిరుమలరాయని కంకితమిచ్చెను. తిరుమలదేవరాయలు క్రీ. శ. 156[illegible]–15[illegible]7 వఱకు విజయనగర సామ్రాజ్యమును పాలించెను. మూర్తికవి కావ్యాలంకారసంగ్రహమను నలంకారశాస్త్రము వ్రాసి నరసరాజున కంకితమిచ్చెను. రామరాజభూషణుడును మూర్తికవియు సమకాలికులు. అన్నదమ్ముల కుమారులు. ప్రబంధాంకమను నింటిపేరుగలవారు. రామరాజభూషణుడు చిన్నవయస్సున కృష్ణదేవరాయల యష్టదిగ్గజములలో నొకడుగనుండి భట్టుమూర్తి యనుపేర పరగుచుండెనని చాటుపద్యములవలన తెలియుచున్నది. వీరిద్దఱును తమగ్రంథములలో తమగ్రామము పేరు చెప్పికొనియుండలేదు కాని వీరిది పల్నాటి సీమలోని భట్టువారిపల్లె కావచ్చును: అందుల కాధారములు.

(1) వీరియింటిపేరు ప్రబంధాంకమువారు. భట్రాజులలో ప్రబంధాంకము వారిప్పటికి [illegible] సంవత్సరములవఱకు

ఘల్నాటిలో భట్టువారిపల్లెలో నుండిరి. ఇప్పుడు లేచిపోయి నారు. భట్టుమూర్తియు రామరాజభూషణకవియు కాశ్యపస గోత్రులు. వీరును కాశ్యపసగోత్రులు. భట్టుమూర్తియొక్కయు రామరాజభూషణుని యొక్కయు వంశజులను తాను చూచి నాననియు, వారు ప్రబంధాంకము వారనియు, ఘల్నాటిలోని భట్టువారిపల్లెలో పదిదినములు వారితో నివాసముచేసితిననియు, వారితో మాట్లాడితిననియు, వారు సాహిత్యములో ప్రవీణు లనియు, రామరాజభూషణుని యొక్కయు మూర్తికవియొ క్కయు నివాసగ్రామము ఘల్నాటిలోని భట్టువారిపల్లెయనియు 1919 సం॥ మే 28వ తేదిగల యాంధ్రపత్రిక యుగాదిసంచి కలో వైయాకరణము గోపాల జయదేవ రాజుగారు వ్రాసినారు. (2) నరసభూపాలీయములో మూర్తికవి 'అమితయశః కాశ్యపీ ప్రబంధాంక' యనియు గద్యములో 'ప్రబంధపఠనా రచనా ధురంధర ప్రబంధాంక వేంకటరాయ...' అని యుండుటచే ప్రబంధముల పఠించుటయందును రచించుటయందును గల ప్రజ్ఞనుబట్టి పౌరుషనామధేయముగా ప్రబంధాంకమనివచ్చెనని తెలియుచున్నది. ఇట్లే విద్యాధరిణి మొదలగునవి భట్రాజు లలో పౌరుషనామధేయములు. విద్యాధరిణివారు భట్రాజు లలో ఘల్నాటిలో మాచెర్ల మొదలగుచోట్ల యిప్పటికిని నున్నారు. వేంకటరాయభూషణుడు, రామరాజభూషణుడు, అనునవి యాయావారలచే భూషింపబడినట్లు బిరుదములే కాని నిజనామములు కావనియు, కావ్యాలంకారసంగ్రహము (నరస

భూపాలీయము) గద్యములో చెప్పబడిన వేంకటరాయభూషణుని కుమారుడగు మూర్తికవియు, వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానముల గద్యములలో చెప్పబడిన సూరపరాజు కుమారుడు రామరాజభూషణుడును నొక్కరేయనియు కొందరనెదరు

(4) కాకునూరి అప్పకవి:- అప్పకవీయ మనబడు ఛందోగ్రంథమును రచించెను. ఆంధ్రమునగల ఛందోగ్రంథములకెల్ల యప్పకవీయము ముఖ్యమైనది. అది క్రీ. శ. 1656-1660 మధ్య వ్రాయబడియుండునని కందుకూరి వీరేశలింగము గారు ఆంధ్రకవుల చరిత్రలో వ్రాసిరి. అప్పకవి బ్రాహ్మణుడు. వైదికుడు. నివాసస్థలము కల్యాణములోని కామేపల్లి. ఇప్పుడున్న కామేపల్లి కాదు. అప్పకవి కామేపల్లి శిథిలమైనది. బ్రాహ్మణపల్లి వద్ద అదియుండెడిది. అప్పకవి తన గ్రామమునకు మార్గములను స్పష్టముగా వ్రాసినాడు. అప్పకవీయమందు

మేలయు వింధ్యాచల మధ్యమంబున కృష్ణ యాము?నీ మున బ్రహ్మక్షేత్రము॥ గీ॥ దాడకాటవి నాంధ్రాభిధానపుణ్య దేశమున శ్రీగిరీశాన్యదిశను, గొండ। వీటి పడమర దంగెడ విష యమునను। గామెపల్లిని గోపాలధామమునను॥ గీ॥ పల్లెనాటను నూటతొంబదియునాల్గు। గ్రామములు ?? ??కునూరి వేంగనార్యాత్మజు వేదవేదాంగములను। బ్రష్టుతికి నెక్కె మాఅవు బ్రహ్మయాజిగ॥ తన గ్రంథమునందు చెప్పిన శ్రీకృష్ణా??? వ్యా?చెను... కం॥ తంగెడతోపును, నిశ్చని గంగానయ నాగ.

నిమ్నగాపూర్వదిశన భింగళిపురదక్షిణమున రాగుగ నాల
కొన్న గోపరత్నంబునకున్॥ కం॥ సాయప వేంకటపతి భూ।
నాయక దత్తాగ్రహార నగరప్రాగ్దేశాయత దేవాలయమున
బాయక వసియించు గోపభామాపతికిన్॥ కం॥ కేతవగ నామ
పట్టణ। దైతేయారాతి సమన్విత నికేతునకున్। వాతాత్మజ తార్క్ష్య
సుతా న్వితునకు సమస్తలోక విఖ్యాతునకున్॥ కం॥ శ్రుతి
శాస్త్రాగమ జితగీష్పతి పత్పైయు పెద్దనార్య సంపాదిత పు
ణ్యాతరాగ్రహార పూర్వ। క్షితిజ శరధికాయామ్యమున వసించిన
హరికిన్॥ అప్పకవి వేలకొలది గ్రంధముల బరిశీలించి
లక్ష్యముల నుదహరించెను. రాచపాటి తిప్పరాజు (త్రిపురాం
తకకవి) చాటుధార ము॥ సరిబేసైరిపుడేల భాస్కరుల
భాషానాథ, పుత్రావనుం। డేయుద్దోలుచు మంత్రిమయ్యె
వినుకొండన్ రామయా। మాత్యుడు। స్కందునో యతడయినన్
సహస్ర కరశాఖల్ లేవ వేయున్నవే। తగ దానము చేయుచో
రిపుల హేతిన్ వ్రేయుచో వ్రాయుచో॥ వంటివనేకములగు
పద్యములప్పకవి యుదహరించుటచేతనే నిలిచియున్నవి. [illegible]
భాండాగారులు ముద్రణయంత్రములు లేని యారోజులలో ననేక
ప్రదేశములుతిరిగి యనేక వ్రాతప్రతుల పరిశీలించి వ్రాసిన
యప్పకవి యెంతయో వందనీయుడు. ఆంధ్రవ్యాకరణమును
'ఆంధ్ర శబ్దచింతామణి' యను పేర సంస్కృతశ్లోకములతో
నన్నయభట్టు రచించెననియు దానిని విపులముగా లక్ష్యము
లతో పద్యరూపముగారచించితిననియు నప్పకవి చెప్పికొనెను.

సాధు రేఫశకట రేఫ (ర, ఱ) లకు యతిప్రాసమైత్రుల నప్పకవి యొప్పలేదు. అతనిపూర్వులలోనొకడు (క) అను అక్షరమునకు నూఱు అర్థములుచెప్పుటచే 'కాకునూరు' యని పౌరుషనామముగా యింటిపేరువచ్చెనట.

5. యథావాక్కుల నన్నమయ్య:- బ్రాహ్మణుడు. క్రీ. శ. 1241 ప్రాంతమున సర్వేశ్వర శతకమును సత్రశాలవద్ద రచించెను.

## అభిమాన కవులు

(పల్నాటినిగూర్చి వ్రాసిన యితరప్రాంతపు కవులు)

1. శ్రీనాథుడు:- జగద్విదితకవి. పాకనాటి నియోగి బ్రాహ్మణుడు. భారద్వాజస గోత్రుడు. ఇతడు 1384 A. D. ప్రాంతమున జన్మించి 1404 లో నైషధము 1424 లో భీమఖండము 1432 లో కాశీఖండము, తరువాత హరవిలాసము ముసలితనములో పల్నాటి వీరచరిత్ర రచించి యుండును. పల్నాటిలో చాలసార్లు తిరిగి పద్యములు చెప్పుటయేగాక పల్నాటి వీరచరిత్రను మంజరి ద్విపదగా రచించెను. నారికురుపుచే బాధపడుచు శోకభారమున నీసుద్దులుచెప్పెనని కొందరందురు. కొందరీక్రింది కథకూడ చెప్పెదరు. "వయసునందు స్వేచ్ఛగదిరుగుటచే మొదలుచెడిపోయెను. పల్నాటిలో చెన్నకేశవుని దర్శింపగ వ్యాధి కొంతతగ్గెను. కలలో చెన్నకేశవుడు గాన్పించి వీరులచరిత్రముచు వ్రాసి తనకంకితము చేయుమని కోరెను. శ్రీనాథుడు వ్రాయుచుండెగాని పూర్తిచేయుటకే

వ్యాధి పూర్తిగ కుదిరెను. పిమ్మట నేకాగ్రమనమునతో మనస్సు నిలించి మొదటివలె విషయలోలుడుకాగా చెన్నకేశవుడు కోపించెను. ప్రతిదినము పగలే ప్రత్యక్షమగు నాదేవుడారోజ నతనికి దర్శనమీయక కలలోకనిపించి నీవుపతితుడవైతివి కావున నీగ్రంథమును గైకొనజాలను. అది మాదిగలపాలౌగాక యని శపించెను" ఈకథ యొల్లన్నను శ్రీనాథుడు రచించిన మంజరీ ద్విపద పిచ్చుకుంటలు మాలలు మొదలగువారి యధీనముననే యుండినది. దానిలో యుద్ధభాగమును అక్కిరాజు ఉమాకాంతముగారు ముద్రింపించిరి.

2. <u>కొండయ్య:-</u> శ్రీనాథునిపిమ్మట నితడు ద్విపదకావ్యముగ కల్యాణి వీరచరిత్రను వ్రాసెను. అది అముద్రితము. చెన్నపురి ప్రాచ్యలిఖిత గ్రంథాలయములోకలదు.

3. <u>మల్లన:-</u> ఇతడుకూడ ద్విపదకావ్యముగ కల్యాణి వీరచరిత్రమును వ్రాసెను. ఇదికూడ ముద్రింపబడలేదు. ఇది కూడ చెన్నపురి ప్రాచ్యలిఖిత గ్రంథాలయములోనే కలదు.

4. <u>ముదిగొండ వీరభద్రకవి:-</u> వీరభాగవతమును వీర కల్యాణి వీరకథను పద్యకావ్యముగా క్రీ. శ 1861 ప్రాంతమున రచించెను. ఇతడు సత్తెనపల్లి తాలూకా నందిగామ నివాసి.

5. <u>వేటూరి వరసయ్యగారు:-</u> క్షేత్రయాత్ర మొదలగు గ్రంథములు రచించెను. గురిజాల హైస్కూలులో కొంతకాలము ఆంధ్రోపాధ్యాయులుగ నుండెను. మాళవమాధవీ యను పద్యకావ్యమును రచించెను.

# శ్రీనాధుని చాటువులు

---

శ్రీనాధుడు పల్నాటిలో ననేక పర్యాయములు దిరిగి యనేక చాటుపద్యముల చెప్పెను. ఆ॥ వె॥ చిన్నచిన్నగుళ్లు చిల్లరదేవుళ్లు। నాగులేటినీళ్లు నాపరాళ్లు। సజ్జజొన్న కూళ్లు సర్పంబులును దేళ్లు। పల్లెనాటిసీమ పల్లెటూళ్లు॥ కం॥ జొన్నకలి జొన్నయంబలి। జొన్నన్నము జొన్నపిసరు జొన్నలెతప్పన్। సన్నన్నము సున్నసుమీ। పన్నుగ పలినాటిసీమ ప్రజలందఱకున్॥ కలియనగా తరవాణివలె బీదలు తయారుచేయు పదార్థము. సన్నన్నమనగా వరియన్నము. కం॥ రసికుడు పోవడు పల్నా। డెసగంగా రంభయైన నేకులెవడకున్। వసుధేశుడైన దున్నును। కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్॥ ఉ॥ అంగడి యూరలేదు వరియన్నము లేదు శుచిత్వమేమి లే। దంగసలింపులేరు ప్రియమైన వనమ్ములు లేవు నీటికై। భంగపడంగ బాల్యపు కృపాపరులెవ్వరు లేరు దాత। రెన్నంగను సున్నగాన పలినాటికి మాటికి బోవనేటికిన్।

---

పల్నాటిలోని కొన్ని గ్రామములగూర్చి చెప్పినపద్యములు.

---

గురజాల:-(భోజనమాదొరకదట తేలుమందు దొరకునని శ్రీనాథుని కష్టమాయెను) కం॥ తేళులమందుగ భోనము। పాలాయెను మంచినీరు, పడియుండుటకే। నేలేకరువైపోయెను,। కాలిన గుర్రాల నిప్పుకామేశహరా॥

పులిపాడు:- ఆ॥ వె॥ ఊరువ్యాఘ్రనగర మురగంబు కరణంబు। కాపుకపివరుండు కసవునేడు। గుంపుగాగఁజేరి గురిజాల సీమలో। నోగులెల్లఁగూడి రొక్కచోట॥ ఊరిపేరు వ్యాఘ్రనగరము (పులిపాడు) కరణము పాము (శేషయ్య) కాపుకోతి (హనుమయ్య) గ్రామాధికారి కసవు (పూరిపుల్లతో సమానము-పుల్లయ్య)

నెమలిపురి:- కం॥ నెమలిపురి యమపురంబుగ,। యముఁడాయెను బసివిరెడ్డి, యంతకు మిగులన్। యమదూతలైరి కాపులు। క్రమమెఱుఁగని కుక్కలైరి కరణాలెల్లన్॥

అగిగొప్పుల:- హోరుగాలివలన నిద్రపట్టక యొక గుడిలోపరుండెను. గుడిమీదనున్న కోతివలన నచటను నతనికి నిద్రపట్టలేదు. గుడిలోపలనున్న నంబివారి కోడలు దానికితోడయి నిద్రపట్టనందున నడివీధిలో పరుండెను. నడివీధిలోనున్న యొకజారిణి కారణమున నచ్చటకూడ నిద్రపట్టలేదు. తెల్లవారగనే యాగ్రామమునుండి వెడలిపోవుచు చెప్పినపద్యము.
కం॥ గుడిమీది కోతితోడను। గుడిలోపలి నంబివారి కోడలితోడన్। నడివీధి లంజతోడను। నడిగొప్పుల హోరుగాలి నణగితి ననుమా॥

కారెమపూడి:- ఉ॥ వీరులు దివ్యలింగములు విష్ణుఁడు చెన్నుఁడు, కల్లిపోతురా। జారయ కాలభైరవుఁడు, నంకమశక్తియె యన్నపూర్ణగా। నేరెడు గంగధారమడుగే మణికర్ణికగా జెలంగు నీ। కారెమపూడి పట్టణము కాశిగదా కలినాటివారికిన్॥

శ్రీనాథుడు భోగి. వరియన్నము దినుచు సన్నని వస్త్రములఁ గట్టుచు నుద్యానవనములందు దిరుగుచు మృదుశయ్యల బవ్వళింపుచు విలాసముల దేలువాఁడు. పల్నాటిలోని గ్రామజీవితమును నందలిజొన్నన్నము రుచింపలేదు. అదియునుగాక యాకాలమునాటి స్థితిని శ్రీనాథుడు వర్ణించియుండును. కాని యిప్పుడు మార్పుజెంది నాగరికతయందు పల్నాడు పురోగమించినది.

## ప్రస్తుతస్థితి

రెంటచింతలలో పెద్ద మిషన్ వైద్యాలయము కలదు. ఆ గ్రామమునందే గ్రుడ్డివారలకు పాఠశాలకలదు. అక్షరములు నుబ్బెత్తుగా పెద్దవిగా ప్రత్యేక కాగితములమీద తయారు చేయుదురు. గ్రుడ్డివారలా యక్షరముల దడిమిచూచి స్పర్శజ్ఞానముచే వారియాకారముల దెలిసికొని చదివెదరు. వారికై తయారుకాబడిన ప్రత్యేకపుస్తకములను మాత్రమే చదువ గలరుకాని యన్నిపుస్తకములను చదువలేరు. ఇచ్చట మంచి రాయిదొరకును. గచ్చుగోడలుకట్టుటకు రెంటచింతలరాయి శ్రేష్ఠమయినది. కాగితములమీద బరువుగనుండు పెళ్ళు రాళ్లను (Paper-weights) అందముగా తయారుచేయుదురు. వీనిలో పనితనముగల రాతివిగ్రహములను తయారుచేయుదురు. తాళ్లపల్లిలో పట్టించు ఖడ్గముదొరకును నవాగుదు వరదాలను తయారుచేయుదురు. ఇంట్లను పటముకు పనికి వచ్చు నాపరాయి పల్నాటిలో విరివిగా దొరకును.

రెంటచింతల, మాచర్ల, రాయవరము, గోలి మొదలగుచోట్ల నాపరాయితీసి యితరజిల్లాలకు రైలుమీద నెగుమతి చేయుదురు. పిడుగురాళ్లవద్ద సిమెంటుకు పనికివచ్చు రాయికలదు. దానినితీసి రైలుమీద తాడేపల్లిలోని సిమెంటుఫాక్టరికి యెగుమతి చేయుదురు. కారెమపూడిలోను దాచేపల్లిలోను ఆకు తోటలు, నారింజ మొదలగు ఫలవృక్షములుగల తోటలు నాగులేటి నీటిచే సాగగుచున్నవి. దంతుబాటలో కృష్ణకీవలి గ్రామమగు పొందుగులవలనకును, ఆవలి గ్రామమగు వాడపల్లి నుండి హైదరాబాదుకు మోటారుసర్వీసు కలదు. హైదరాబాదు వాడపల్లికి 100 మైళ్లుండును. కృష్ణను పడవలలో దాటెదరు. నాగార్జునకొండ ప్రాంతమున కొండపిండియని పిలువబడు చెట్టుపూత దొరకును. దూదికిబదులు పశువులకు దిండ్లకు వాడిన చలువగానుండును. కారెంపూడి ప్రాంతమున నడవులలోనుండు కొరనాసియను జంతువునుండి క్రొవ్వుదీసి వాతనొప్పులకు నౌషధముగా వాడెదరు.

పిల్లుట్ల:- గుజ్జుల వీరారెడ్డిచే స్థాపింపబడిన అనాధశరణాలయమున్నది. హైస్కూలు వసతిగృహము నున్నవి.

## దృశ్యములు

ఎత్తిపోతల:- ఇది జలపాతము. చంద్రవంకవాగులోని నీరు 66 అడుగుల ఎత్తునుండి క్రిందికి దుముకుచుండును. చూచుటకు మనోహరముగా నుండును. మాచర్లకు 5 మైళ్ల

దూరమునను కృష్ణానదికి మూడుమైళ్లదూరమున నిడికలగు. త్రికోణాకారముగల లోయలోనికి నీరు దుముకి యచటనుండి కృష్ణలో కలియును. లోయలోపలికిదిగి నీరుపడుచోటికి పోవచ్చును. నడివేసవిలోనైనను కొద్దిగానైనను నీరు దుముకుచుండును. గొట్టిపాళ్లవద్ద పెద్దదూకుడు, చిన్నదూకుడు అను రెండుజలపాతములును, దైదవద్ద బిలగుండమను చిన్న జలపాతమును. కలవు.

నాగార్జునకొండ:- దీనివిషయము ప్రత్యేకముగా వ్రాయడమైనది.

నాయకురాలి కనుమ:- కారెంపూడికి దక్షిణమున నాలుగుమైళ్లదూరమున రెండుకొండలమధ్య నాగులేరు ప్రవహించును. దానిని నాయకురాలికనుమ యందురు. ఇచ్చట చిన్న యడవికలదు. కారెంపూడినుండి వినుకొండకు పోవు రోడ్డు యీకనుమగుండ పోవును.

గుత్తికొండ బిలము:- గుత్తికొండయను గ్రామమునకు మూడుమైళ్లదూరమున నుండును. చిన్న అడవియు కొండలును కలవు. కొండకు నొకపెద్ద బిలము (పెద్దకన్నము) కలదు. బిలము రమారమి 160 గజములుండును. కొన్నిచోట్ల విశాలముగను కొన్నిచోట్ల ఇరుకుగను నుండును. ఇరుకుగానున్న చోట్ల వంగిపోవలెను. లోపల చీలని చిన్నబిలములు కొన్ని యుండును. చీకటిగానుండును. అందు మంచినీరుండును. పొడి వంటి తెల్లనిపదార్థము నీటిపై తేలుచుండును. బిలముముందర

నొకకరణము పమాధియున్నది. కొండమీదకురిసిన వర్షపు నీటిలోని కొంతభాగము కొండలోనికిదిగి ప్రకృతిసిద్ధముగా నాకొండలో నేర్పడిన ఖాళీస్థలములో నానీరు నిలిచినది. బయటినుండి యానీటివద్దకు బోవుటకు మార్గముగా బిలము ప్రకృతిసిద్ధముగా యేర్పడినది. దైదవద్దకూడ నొకచిన్నబిలము కలదు. శివరాత్రినాడు యాత్రికులచ్చటకు పోయెదరు.

కారెమపూడి వీరులగుడులు:- నాగలేటియొడ్డున గంగధార మడుగునకు సమీపమున యుద్ధములో చనిపోయిన వీరులపేర చిన్నగుడులు, విడిస్తంభములు, మండపములుకొన్ని కలవు. కొన్ని శాసనములుకూడ కలవు. దానికిసమీపముననే యుద్ధముజరిగిన ప్రదేశముకలదు. ఇప్పుడది కైత్వారీపొలముగా నున్నది.

## పుణ్యక్షేత్రములు

మాచర్ల:- చెన్నకేశవాలయ మున్నది. ఇది చాల పూర్వుల ప్రతిష్టయునియు ఈగుడిని బ్రహ్మనాయుడు పెద్దదిగా కట్టించి మండపప్రాకారాదుల నేర్పఱచెనందురు. ఆలయము పెద్దది. జమ్ములమడకయను నగ్రహారి మీగుడికీనాముగానున్నది. ఇది H R E బోర్డువారి పాలనక్రింద నున్నది. ఇందు ఆదిత్యేశ్వరాలయము (శివాలయము), శిథిలమయిన వేంకటేశ్వరాలయము కలవు. మండప స్తంభములమీదను ఆలయప్రాకారపు గోడలమీదను శిల్పకళ చిత్రింపబడి

యున్నది. వీరభద్రస్వామిగుడి మండపపు పైకప్పుయొక్క-లోపలిభాగమందు పురాణకథలు చిత్రింపబడినవి. వేంకటేశ్వరాలయపు ద్వారబంధముల శిల్పకళ చాల రమ్యముగానుండును. ఆలయమునకు పెద్ద రథముకలదు. రథచక్రములు మూడుగజముల యెత్తుండును.

ఏలేశ్వరము:- మాచర్లనుండి నాగార్జునకొండ మీదుగ పడమర మూడుమైళ్లుపోయి కృష్ణానదిని దాటిన యేలేశ్వరపు శివాలయ ముండును. ఇది నైజాములోనిది. శివరాత్రికి యాత్రికులు పోయెదరు. బ్రహ్మనాయని విగ్రహముకలదు.

సత్రశాల:- కృష్ణానదియొడ్డున జెట్టిపాలెమను గ్రామమునకు మూడుమైళ్ల దూరమునగల శివక్షేత్రము. శివరాత్రికి తిరునాళ్ల జరుగును. చాలమంది యాత్రికులు వచ్చెదరు. పడవనెక్కి కృష్ణానదిమీద విహారము చేయవచ్చును.

సంగమేశ్వరము:- పొందుగులవద్ద కృష్ణానదినిదాటిన యావలియొడ్డునగల వాడపల్లియను గ్రామమువద్ద నిదికలదు. ఇది శివక్షేత్రము. శివలింగముపైనగల గుంటలో నీరూరుచుండును. ఆనీటిని పాఱపోసినయెడల మరల నీరూరుచుండును. ఇది నైజాములోనిది.

మట్టపల్లి:- తంగెడవద్ద కృష్ణను దాటిన యావలియొడ్డున నిదికలదు. ఇందు నరసింహస్వామి యాలయముకలదు. ప్రతి సంవత్సరము వైశాఖపూర్ణిమనాడు యుత్సవము జరుగును. ఇది నైజాములోనిది.

గుత్తికొండ బిలము:- తొలి యేకాదశినాడు చాల మందివచ్చి బిలములో స్నానముచేసి దానికి దగ్గరగానున్న చేజెర్లలోని కపోతేశ్వరాలయమును దర్శింపపోయెదరు.

తేరాల:- మాచర్లకు అయిదుమైళ్లదూరమున కలదు. ఇందు సిద్ధేశ్వరస్వామిగుడి కలదు. శివరాత్రికి యాత్రికులు వచ్చెదరు. అచ్చటగల యొకగుండములో స్నానముచేసి గుడిలోనికి పోయెదరు.

ఎత్తిపోతల:- లోయలోగల రంగనాయకస్వామిదేవాలయమునకు వైకుంఠయేకాదశినాడు కొందరు యాత్రికులు పోయెదరు.

చైద:- గ్రామమునకు వెలుపలనున్న శివాలయమునకును దానికి దగ్గరగానున్న బిలమునకును శివరాత్రికి యాత్రికులు పోయెదరు. ఇచ్చటకు రెండుమైళ్లదూరమున కృష్ణానదికలదు. కొండలోనుండి శివలింగమునకు క్రిందుగా నీటిధార గొప్ప బుగ్గవలెనుండి వచ్చుచుండును. వానిని బుగ్గయనియెదరు. బుగ్గనీరు కృష్ణలో కలియును. కొండపైనబడిన వర్షపునీటిలో కొంతభాగము కొండలోని కింకును. ఆ ఇంకుటవలన బావిలో జలలవలె ధారలుగా నీరు కొండనుండి బయటికి వచ్చుచుండును. దగ్గరదగ్గరగాడ నిట్టిబుగ్గలు కలవు.

## ముఖ్యమగు తిరుణాలలు



శివరాత్రికి సత్రశాల, తేరాల, చైద మొదలగు చోట్ల తిరుణాలలుజరుగును. చైత్రశుద్ధపూర్ణిమ మొదలు మాచర్లలో

ఖండము శాలివాహనశక 1508 (క్రీ. శ. 1585) లో రచింప బడెను. మార్కండేయప్రభుని కాలము క్రీ. శ. 1570 నుండి ప్రారంభము. ఇతనిపూర్వులలో నైదవతరమువాఁడు బెజవాడను పాలించి బెజవాడప్రభువని ప్రసిద్ధిగాంచెనని నాగరఖండము చెప్పుటచే నతనిరాజ్యము బెజవాడవఱకు నుండెననియు, విజయవాడకు బెజవాడయని యప్పటికే పేరుండెననియు నూహింపవచ్చును. మార్కండేయప్రభు వనేకదానములు చేయుటే కాక శ్రీశైలమున నేకాదశలింగముల ప్రతిష్ఠించెనట.

నాగరఖండకవులు తమ్ముఁగూర్చి చెప్పికొనినది.

కం॥ అభినవ విశ్రుతకవితా । విభవుల మఖిలాగమాంత
విద శౌనక గో । త్రభవులము బుధవిధేయుల । ముభవపదాం
భోజ బంభరాత్ములము మహిన్ కం॥ రసికులు తుర్కా-
రాజన । నసమప్రతిభావిరాజిత యాల్యాంకిత బా । ల సరస్వతి
యనువారల । మనహిన్ ప్రజ విహారణాధ్యులము మతిన్॥
చ॥ మమ్ముఁ బిలిపించి చాల బహుమానమొసర్చి కవీంద్రులార
స్కాం । దమున మహాప్రసిద్ధమగు నాగరఖండముఖండ విశ్వ
క । ర్మ మహిత వైభవాకరము మాకు తెనుంగున నంకితంబుగా ।
రమణ రచింపగా దగు బురాణవిమల్ మదిరాణ మెచ్చగన్॥

## పెండోటయును తత్ప్రభుని వర్ణనము
(నాగరఖండములోని పద్యములు)

---

సీ॥ కోటయేకోటికి మేటియై మిక్కిలి । చూపట్టు చక్కని
చుట్టుకట్టు । క్రీడాద్రులే పురికిని సప్తకుల పర్వతములు నా నొప్పు

మందరనగములు । బొడ్డన బావులేపుటభేదనంబు కమృతాభి ముఖ్యరత్నాకరములు । రవిసోమశీధులే రాజధానికి ప్రసిద్ధిగను నేబదియాఱుదేశములును॥ గీ॥ పరమమగునట్టి పెంగోట పురవరమున । కధిపతి శిరోవతంసమై యలరె సకల । కళల ధవళేశ్వరపురవిఖ్యాతుఁడైన । గురుతరయశోధనుండు మారోజుఁ డు ఘనుఁడు॥ సీ॥ శాలివాహనశక సంఖ్యాకములునగు పదియేనువందల పైయెనిమిది । వత్సరంబులలోన వసుధాస్థలంబున కుతుబుషాహి నిజాంకుతలనాథు । ప్రాభవవేళమారోజుండేయభూపతి ధవళేశ్వరాన్వయ భవుఁడగుచు । సకలదిశావ్యాప్తి సాంద్రసుధా స్వచ్ఛకీర్తి పరంపరాస్ఫూర్తినేరి॥ గీ॥ సురుచిరంబైన పెంగోట పురినసించి । విశ్వకర్మాన్వయాంబుధి వలయుఁడై । సత్కులం తానములనేసి సుప్రసిద్ధ । ... వర్యులు భళియని స్తుతియొనర్ప । ధరను బాలించుచుండెను ధర్మనీతి॥ కం॥ అతఁడు ప్రసిద్ధివహించెన్ । క్షితి నరగజపతుల గెలిచి చెలఁగి జయశ్రీ । సతిఁజేకొనిన మహమ్మద్ । కుతుబ నిజాంచంద్రునకును కుడిభుజముగుచున్॥ ఉ॥ ఎంతని యెన్నవచ్చు ధవళేశ్వరసోమయ మారుకండు ధీ । మంతుని రాజ్యభారము, సమగ్రవిభూతియు, సర్వమంత్రిసా । మంతులు యందఱింబులె చమత్కృతి బాగ రేకుదీర్చి న । ట్లెంతటనిండు దర్శ్రహ సమావృతి చాల యలంకరించుచున్॥ కం॥ వినిద ముగ సల్పె నేకా । దశ మారోజుండయ్య లింగధామములను । నిలను వ్యాప్తిన్ శ్రీగిరి నాం । శశితారార్కముగ స్థిరమై

వాగ్రణులై॥ సీ॥ పెందోట పురవరమందు గాపురముండు విశ్వకర్మాన్వయ విబుధవరులు। నగ్రహారాది సమగ్రసుస్థ్వాదిక ములును గల్గుటచేత గలిమిగాంచి। వేదశాస్త్రాదిక విద్యల జదివి దివ్యజ్ఞాన సంపత్తినతిశయిల్లి సకలయజ్ఞంబులు సరవితోఁగావించి నిత్యాగ్నిహోత్రులై నెగడుచుండి॥ గీ॥ సుర పితామహునిని శతాధ్వరుని గురుని। ధిక్కరించియు నిరత వితీర్ణమహిమ। ధైర్యమునవారిదాద్రుల దలకునటుల। జేసి బ్రహ్మణ్యులైరి యీస్థిగను స్థిరత॥

## పల్నాటి వీరగాధ

12 వ శతాబ్దమున గురజాల రాజధానిగ పల్నాటిని అలుగురాజేలుచుండెను. అతనికి మైలమ్మయందు నలగామ రాజు, విజ్జలదేవియందు మలిదేవాదులు భూరమాదేవియందు నరసింగరాజు జన్మించిరి. అతనివద్ద బ్రహ్మనాయుడు మంత్రిగా నుండెను. అలుగురాజుపిమ్మట నలగామరాజు రాజయ్యెను. జట్టిగామాలపాటిలో నాయకురాలను పేర వ్యవహరింపబడు నాగమ్మయను నితంతువు లౌకికవ్యవహారములందు ప్రజ్ఞగలిగి యుండెను. ఆమె రాజును మెప్పించి మంత్రిణి యయ్యెను. బ్రహ్మనాయునియం దసూయకలిగి యతనికిని యతని యను చరులగు మలిదేవాదులకును నపకారములు చేయుచుండెను. అంతట బ్రహ్మనాయుడు రాజనుజ్ఞనుపొంది మలిదేవాదులతో మాచర్లకుపోయి యాప్రాంతమును మలిదేవాదులపేర

నేయుచుండెను. కోడిపోరు పందెములకని బ్రహ్మనాయుని గుర జాలకు పిలిపించి మాయచేతను మోసముచేతను నతనిని నాయకురాలు కోడిపందెములందు గెలిచెను. ఏర్పఱచుకొన్న సమయము ప్రకారము మాచర్లసీమను నలగామరాజునకు వదలి సపరివారముగా వెడలిపోయి యేడుసంవత్సరము లడవులందు బ్రహ్మనాయుడు గడపెను. నలగామరాజు నల్లుడు యలరాచమల్లు యనువాడు బ్రహ్మనాయునివద్ద నుండెను. తమ మాచర్లసీమను మరల తమకిమ్మని నలగామరాజువద్దకు అలరాచమల్లుడు బ్రహ్మనాయుడు రాయబార మంపెను. కాని నలగామరాజు వినలేదు. తిరిగి బ్రహ్మనాయునివద్దకు బోవుచుండగా అలరాచమల్లును నాయకురాలు విషప్రయోగముచే చంపించెను. అదివిని బ్రహ్మనాయుడు నలగామునిపై దండెత్తి మేడపినుండి కారెమపూడివచ్చెను. నలగామరాజును తనసైన్యముతో వచ్చి కారెమపూడివద్దవిడిసి సంధికై బ్రహ్మనాయుని వద్దకు రాయబార మంపెను. సంధి కుదురకుండెను.

బ్రహ్మనాయుని కుమారుడు బాలచంద్రుడు యుద్ధము సంగతి తెలియక మేడపిలో బొంగరము లాడుచుండెను. బొంగరము కాలికితగిలిన యొకకోమటి స్త్రీవలన యుద్ధవిషయము తెలిసికొని యుద్ధమునకు పోవ నిశ్చయించుకొని సెలవునకై భార్యయగు మాంచాలయింటికి పోయెను. భార్యామోహములో బడి యుద్ధవిషయము మఱచెను. అదిగ్రహించి వీరపత్నియగు మాంచాల నెదియో యొక నెపముతో నారాత్రిగడిపి మఱు

నాడు దీవించి యతనిని యుద్ధభూమికి బంపెను. బాలచంద్రుని వెంట బ్రాహ్మణుడగు యనపోతు ఉండెను. అతడు యుద్ధమున చనిపోయినచో బ్రహ్మహత్యాపాతకము తనకువచ్చునని భయపడి యేదియోయొక నెపముతో నింటికిబంపెను. తన యానగా యుద్ధభూమికి రావద్దని చీటి చెట్టుకుకట్టి యుద్ధభూమికి బాలచంద్రుడేగెను. అనపోతు తిరిగివచ్చి చీటిచూచుకొని బాలుని యానదాటలేక సమరోత్సాహము భంగమయినందులకు వగచి, పొడుచుకొని చచ్చెను. అతని రక్తపుజందెమును మాడచి యనునామె కారెంపూడిలోనున్న బాలచంద్రుని కంఠజేసెను. స్నేహితుడగు ననపోతు మరణమునకు వగచి బాలచంద్రుడు సమరోత్సాహమునుమడింప యుద్ధమునునిశ్చయుంచెను. నైనను సంధిప్రయత్నము సాగుచున్నమును నాగులేటిలో పాలవేసి వారలను యుద్ధమునకు ప్రోత్సహించి సంధిచెడగొట్టెను. అభిమన్యునివలె యుద్ధములో బోరెను. నాయకురాలి దుశ్చేష్టలకు తోడుగానున్న నరసింగరాజు తలనుగోసి బ్రహ్మనాయని ముందటవైచెను. మరల యుద్ధమునకుబోయి చాలమందినిజంపి తానుజచ్చెను. యుద్ధమునందు మలిదేవాదులుకూడ చనిపోయిరి. నాయకురాలు బందికాబడెను. స్త్రీని చంపకూడదుగనుక దేశమునుండివెడలగొట్టబడెను. నాయకురాలి మైకమునుండి నలగామరాజు విముక్తుడై పశ్చాత్తాపపడి హతశేషులతో రాజ్యమేలెను. ఈ యుద్ధము క్రీ. శ. 1180 ప్రాంతమున జరిగెను.

# నాగార్జునకొండ



మాచర్ల రైలుస్టేషనునుండి 14 మైళ్లదూరమున నిది కలదు. మాచర్లనుండి యిచటకు రోడ్డుకలదు. ఇది పర్వతములమధ్య కృష్ణానదీతీరమున నున్నది. దీనిదగ్గర పుల్లారెడ్డిగూడెమను గ్రామమున్నది. 25 సంవత్సరములక్రింద నిచట త్రవ్వగా కొన్ని బౌద్ధవిగ్రహములు బయల్పడినవి. వానినన్నిటి నొకచోటచేర్చి యొక శిల్పవస్తు ప్రదర్శనశాల (మ్యూజియము) గవర్నమెంటువారు కట్టిరి. మాచర్లవచ్చు యాత్రికుల సౌకర్యార్థ మొక బంగళాను కట్టిరి. ఇచట కొన్ని బౌద్ధవిగ్రహములు, స్తూపములు, చైత్యములు, విహారములు, సంఘారామములు బయల్పడినవి. శిథిలమైన యిచటి స్తూపమునందలి పునాదులును ప్రదక్షిణాపథమును మిగిలియున్నవి. ఈ స్తూప వృత్తముయొక్క వ్యాసము 102 అడుగులు. ఇందుకుపయోగించిన యిటుకలపరిమాణము 20" × 10" × 3". ఈ స్తూపము చుట్టు 5 అడుగుల వెడల్పున ప్రదక్షిణాపథమున్నది. బ్రాహ్మీభాషలో కొన్ని శిలాశాసనములును, కొన్ని రోమనురాయ నాణెములు, ఇక్ష్వాకు నాణెములు దొరకినవి. అనేక గర్భములలో గూడ జాగ్రత్తగా భద్రపరచబడి యొక బంగారుపెట్టెలో నున్న యెముక దొరకినది. గోళాకారముగు యొక పెద్దకుండ దొరకినది. దాని వ్యాసము 6 అడుగులు. అది సమానముగు రెండు చిప్పలు కలిగియున్నది. రెంటిని కలిపిన పెద్దబంతివలె నొకటగుచుండును. నాగార్జునకొండవద్ద విజయపురియను పట్టణముండెడిది. ఆపట్ట

ణామందలి గృహములపునాదు లిప్పటికిని కన్పించుచున్నవి. కృష్ణానదినుండి పట్టణములోనికి పోవుటకుగల కాలువజాడ లిప్పటికినున్నవి. ఇచటనొక విశ్వవిద్యాలయముండెడిది. బౌద్ధ సన్యాసులు నివసించుగదుల పునాదులు గన్పించుచున్నవి. వారు మూత్రవిసర్జనచేయుటకు వీలగు సన్నని (రాతితో చేయబడిన) కాలువలిప్పటికి స్పష్టముగా గన్పించుచున్నవి. మొత్తముమీద నాగార్జునకొండవద్ద మూడు సంఘారామములు, ఆరు బౌద్ధాలయములు 14 స్తూపములు బయల్పడినవి. ఇందలి దృశ్యముల ఫొటోలతోగల్గిన పురాతత్వశాఖవారి పుస్తకమొకచ్చటొకటి కలదు గ్రామాధికారులా పుస్తకమును చూపెదరు. కాకతీయుల కాలమున కట్టబడిన కోటగోడలు ప్రాకారములు, దేవాలయములు, పెద్దదిగుడుబావి, కొండమీద కలవు. నాగార్జునుడను బౌద్ధసన్యాసి రెండవ శతాబ్దాంతమున నిక్కడ నివసించెను. ఇతనినిబట్టియే దీనికీపేరువచ్చెను. ఇతడాంధ్రుడు. బ్రాహ్మణుడు. సింహళదేశమంతయు తిరిగినవాడు. శాతవాహనవంశపు రాజుల అంతఃపురస్త్రీలకు బౌద్ధమతము బోధించెను. సుహృల్లేఖ మొదలగుకావ్యముల రచించెను. రసాయనిక శాస్త్రమందును, వైద్యశాస్త్రమందును ప్రవీణుడు. ప్రజ్ఞాపరిమితములు మొదలగు మహాయానసూత్రములను రచించెను. ఇతని గ్రంథములన్నియు సంస్కృతభాషలోనున్నవి. చీనాటిబెట్టులలో నితడు ప్రసిద్ధుడు. ఇప్పటికి నా దేశప్రజలచేత పూజింపబడుచున్నాడు. బౌద్ధమతములో

హీనయానులని మహాయానులని రెండు తెగలు. హీనయానులు విగ్రహారాధన చేయరు. మహాయానులు విగ్రహారాధన ఉత్సవములు చేయుదురు. బుద్ధుని ప్రతిమతోబాటు హిందూ దైవత విగ్రహములనుకూడ పూజింతురు. నాగార్జునుడు మహాయానశాఖను నిర్మించెను. ఇతనికి యజ్ఞశ్రీశాతకర్ణి యను యాంధ్రప్రభువు పోషకుడుగ నుండెను.

## నందికొండ

నందికొండ యనుచోట కృష్ణానదికి యానకట్టకట్టుటకు కేంద్రప్రభుత్వము నియమించిన ఖోస్లాకమిటి సూచించినది. ఈ స్థలము మాచర్లకు 12 మైళ్ళదూరమునను నాగార్జునకొండ కైదు మైళ్ళదిగువను, నాగులవరము గ్రామమునకు దగ్గరగాను నుండును. ఇచ్చట కృష్ణకావలి యొడ్డున నందికొండ యను గ్రామముండుటచే దీనికాపేరువచ్చినది. కృష్ణానదికి రెండువైపుల రెండుకొండలు పెట్టనిగోడలవలె నుండును. నదీగర్భము శిలామయమగుటచే పునాదులకు నెక్కువఖర్చు లేదు. కృష్ణకు రెండువైపుల రెండులోయలు ప్రకృతిసిద్ధముగా నుండుటచే కాలువలుత్రవ్వుట సులభము. ఇచ్చట ఆనకట్టకట్టి యెడమ వైపు కాలువత్రవ్వుటకు నైజాముప్రభుత్వ మిదివరకే పూనుకొనినది. కుడివైపున కాలువలు త్రవ్వినయెడల గుంటూరు, కర్నూలు నెల్లూరుజిల్లాలు సాగయి చెన్నపట్టణమునకు నీటి సప్లయి చేయవచ్చునని యాలోచన చేయబడినది. ఇది ఆనకట్టకట్టుటకు ప్రకృతిసిద్ధముగ తగిన స్థలము. తక్కువఖర్చుతో

శీఘ్రఫలితములనిచ్చి యెక్కువభూమి సాగుబడి యీప్రాజెక్టు వలన కాగలదు. ఇప్పటి యంచనాలప్రకారము ఈప్రాజెక్టు వలన 70 లక్షలయకరముల భూములు సాగగును. 2 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి యుత్పత్తికాగలదు. 35 లక్షలటన్నుల ధాన్యమధికముగా నుత్పత్తికాగలదు. అదిగాక ఈప్రాజెక్టుకు నగు ఖర్చులో కొంతభాగమును నైజాముప్రభుత్వము భరించును గనుక మితవ్యయముతో నిది పూర్తికాగలదు.

## రామరాజు మంత్రప్పదేశాయి

---

'అబుల్ హాసన్' అనునతడు గోల్కొండ రాజ్యమును క్రీ. శ. 1672 నుండి 1687 వరకు పాలించెను. ఇతడు హిందువులను మహమ్మదీయులను సమానముగా జూచెను. ఇతనికి తానీషాయను బిరుదుకలదు. ఇతనికాలముననే భద్రాద్రి రామదాసుకథ జరిగినది. అదివరకు మంత్రిగానుండిన ముజాఫరును దొలగించి పింగళి మాదన్నను క్రీ. శ. 1673 లో మంత్రిగా నియమించెను పింగళి మాదన్నకు సూర్యప్రకాశరావను బిరుదముకూడ నిచ్చెను. మాదన్నకు సోదరుడగు అక్కన్న యితనివద్ద సేనాపతిగానుండెను. అప్పుడు పల్నాడు గోల్కొండ నవాబుక్రింద నుండెను అజ్ఞీపెట్టి రామరాజు మంత్రప్పదేశాయి యనునతడు తానీషానుండి, మాచర్ల, తుమ్మకోట, కారెంపూడి, గురజాల, తంగెడ యను అయిదుమహాగాణాలను మహానూల్లు చౌదరితనము (శిస్తువసూలుచేయు పదాధికారముగల సీమపెత్తనము) పుత్రపౌత్ర పరంపర్యముగా నుండునట్లు

హిజరి 1091 (1673 A. D.) లో సంపాదించెను. శిస్తులో నూటికి అయిదువరహాలచొప్పున జమీందారి రుసుమున్ను, నూఱుకుచ్చెళ్లకు 5 కుచ్చెళ్లచొప్పున ఈనామున్ను ప్రతిసంవత్సరము పుత్రపౌత్ర పారంపర్యముగా ననుభవించునట్లు ఈయబడెను. ఆఫర్మానామీద ముంజుదారు సూర్యప్రకాశరావుజీయని మహారాష్ట్రభాషలో సంతకముండెను. ముంజుదారనగా మహారాష్ట్ర పరిపాలనా పద్ధతిలోని యార్థికమంత్రికి పేరు. సూర్యప్రకాశరావనునది మాదన్నకుబిరుదు. అక్కఱు సుభాన్ పంతులుగారు (అక్కన్నగారు) పల్నాటిని పర్యటించి హనుమంతునిపాడు, వీరభద్రాపురమను గ్రామముల కట్టించి మాచెర్ల వీరేశ్వరస్వామికి (వీరభద్రునకు) యీనాముగా 23 రబ్బీరవల్ 1092 హిజరి (1674 A. D.) తేదిననిచ్చెను. ఆరెండుగ్రామము లిప్పుడులేవు. శిథిలములైనవి. క్రీ. శ. 1687 లో గోల్కొండరాజ్య మవ్రరంగజేబు వశమయ్యెను. అలంగీరు పాదుషా (ఔరంగజేబు) చేత 1106 హిజరీలో (1688 A. D.) పల్నాటితాలూకా మాచర్ల, గురజాల, కారెంపూడి, తుమ్మకోడు, తంగెడయను యయిదుపరగణాలు రామరాజు మంత్రప్పకు తహసీలు వసూలుచేయుట జరుపగలందులకు పుత్రపౌత్ర పారంపర్యముగా నధీనముచేయబడెను. సంవత్సరమునకు సర్కారుకు 28 వేల వరహాలశిస్తు పేష్కసుగానుండెను. అక్కన్నగారి దానశాసనపు నకలును తానీషా మంత్రప్పకిచ్చిన ఫర్మానాకు నకలును ఔరంగజేబు మంత్రప్పకిచ్చిన

ఫర్మానామూలమును, తదితర పూర్వపు కాగితములును మంత్రప్పవంశీయుడగు గామాలపాటి కరణమువద్ద నిప్పటికిని నున్నవి. తానీషాయిచ్చిన ఫర్మానా భరణపు వ్యవహారసందర్భమున కోర్టులో దాఖలుకాబడినందున నకలుమాత్రమున్నది. ఔరంగజేబుయిచ్చిన ఫర్మానామూలమున్నది. పారశీకభాషలోనున్నది. వానిని నేనుచూచితిని. క్రీ. శ. 1707 లో ఔరంగజేబుచనిపోయెను. అప్పటినుండి యితరప్రాంతములతో బాటు పల్నాడు నిజాముల స్వాధీనమయ్యెను. మనదేశములో రాజులు మారినను జమీందారీతనము గ్రామజీవనము మొదలగునవి మారలేదు. 1138 ఫసలీ కీలక సం॥ (1729 A. D) లగాయతు 1140 ఫసలీ సాధారణ సం॥ (1731 A. D.) వరకు రామరాజు జంగమయ్య అటుపిమ్మట శంకరనారాయణ మహమ్మద్ ఖానుకు లోబడి పల్నాటికి దేశముఖులుగానుండిరి. మంత్రప్ప కుమారుడు జంగమయ్య పల్నాటిలోని స్థలకరిణీకముల ననేకములిచ్చెను. గురజాలవద్దనున్న జంగమహేశ్వరపురమును తన పేర కట్టించెను. రామరాజు శంకరయ్య సత్రసాలకు సర్వమాన్యముగా 50 కుచ్చెళ్లభూమిని దానమిచ్చెను. (కుచ్చెల యనగా 30 ఎకరములుండును) మాచెర్ల వీరభద్రస్వామికి 10 కుచ్చెళ్లభూమి ఈనామిచ్చెను. వీరియింటి మూలపురుషుడు నాగమ్మయనునామె జంగమహేశ్వరపురమువద్దనున్న నాగమ్మచెరువు తనపేర త్రవ్వించెను. దేవాలయములకును లంకావారు మున్నగు బ్రాహ్మణులకునింకను కొన్ని భూదానములిచ్చెను.

వీరియింటివేల్పగు అంబపేర అంబాపురము కట్టబడి నట్లును, అల్లుమల్లెపాడు, మల్లవర అగ్రహారముల వీరిచ్చినట్లు చెప్పెదరు. శంకరనారాయణ పెద అగ్రహారమును రేమిణి వారికిచ్చెను. చిన అగ్రహారమును పరీధావి (1733 A. D)లో వెంపటివారికిచ్చెను. వీరిచ్చిన అగ్రహారములలో త్రిపురసుందరీపురము, వెంకమాంబాపురము, నరసమాంబాపుర మను నవి సర్కారులెక్కలలో గురజాలకు శివారులుగా నున్నవి. అంతట పల్నాడు ఆర్కాటునవాబు స్వాధీనమయ్యెను. మంత్రప్ప మనుమడు వీరభద్రయ్య వరుసగా 34 సంవత్సరములు పల్నాటికి దేశముఖుడుగా నుండెను. అడిగొప్పుల అయ్యవార్లంగారగు పరవస్తు శ్రీనివాసాచార్యులుగారికి విధానంపాడు అగ్రహారమును రామరాజు వీరభద్రయ్యదేశాయి క్రీ. శ. 1748లో నిచ్చెను నవాబుకు చెల్లించవలసిన పైకము సరిగా చెల్లించనందున నవాబగు మహమ్మదుఖాన్ క్రీ. శ. 1764లో వీరభద్రయ్యను తొలగించెను. వీరభద్రయ్యకుమారుడు రాజేశ్వరరాయుడు అప్పటినవాబగు వాలాజాగారికి అర్జి పెట్టుకొనగా నవాబతనికి నెల 1 కి 200 వరహాలచొప్పున భరణమిచ్చెను. అటుపిమ్మట నెల 1 కి 100 కరుకువరహాలకు తగ్గించెను. పల్నాడు ఆర్కాటునవాబునుండి ఈస్టుయిండియా కంపెనివారికి స్వాధీనమయినపిమ్మట రాజేశ్వరరావు బ్రదికియున్నంతవఱకు నెల 1 కి 75 వరహాలచొప్పున కంపెనివారు భరణమిచ్చిరి. క్రీ. శ. 1825లో రాజేశ్వరరావు చనిపోయెను. పిమ్మట నాసంతతివారికి భరణమిచ్చుట మాని వేసిరి.

# ఇతర ప్రఖ్యాత పురుషులు



1. దుగ్గరాజు రాజనాయకుడు:- 13 వ శతాబ్దము వాడు. కాకతీయగణపతిదేవునికి విశ్వసనీయులగు సేనానులలో నొకడు. గణపతి కళింగదేశముపై 1212 A. D. ప్రాంతమున చేసిన యుద్ధములందితడు ముఖ్యుడు. 1228 A. D న గణపతి దేవునిపై కుట్రలుచేసిన సామంతరాజుల నడచుటయందు ఇందులూరి సోమయ్య మంత్రికితడు సహాయముచేసెను. ఈ రాజనాయకుని కుమారుడగు కాటయ శ. క. 1158 (1236 A. D.) లో భూదానముచేసినట్లు ఉప్పరపల్లె శాసనములో నున్నది. ఇతడు పల్నాటిలోని దుగ్గివాస్తవ్యుడనియు, దుగ్గరాజను గృహనామము కలవాడనియు, నియోగిబ్రాహ్మణుడనియు, (Hyd Arch Ser No 3) లోని 'కరుణాన్విత దుగ్గిపరము కాటయ కొసగున్' అను పద్యపాదమునుబట్టి దుగ్గి యనగా పల్నాటిలోని దుగ్గిగ్రామమునగల పార్వతీయనియు, కాటయకాలమునుండి దుగ్గినిబట్టి గృహనామము దుగ్గరాజు అని వచ్చెనని యూహింపవచ్చుననియు కోన వేంకటరాయ శర్మగారు దండనాథులను గ్రంథములో వ్రాసిరి.

2. పింగళి గోవిందయ్య:- ఇతడు 'కల్యాణి' రాజధానిగా నేలిన పశ్చిమచాళుక్య ప్రభువగు త్రిభువనమల్ల విక్రమాదిత్యుని ప్రచండసేనానియగు అనంతపాలయ్యకు మేనల్లుడు. 12 వ శతాబ్దమువాడు. కొండపల్లి దుర్గాధిపతి. నియోగిశైవ

బ్రాహ్మణుడు. యుద్ధమునందు విక్రమచోడరాజును గెలిచెను. పింగళియనగా పిన్నలియగుటచే (23, 24 పుటలుచూడుము) నితడు పల్నాటిలోని పిన్నలికి చెందినవాడు. తనపూర్వులగు పింగళివారు శాఖలుగాచీలి కృష్ణా గోదావరి మండలములందును, పలనాటను పాకనాటను ప్రసిద్ధులైనట్లు పింగళి సూరన వ్రాసెను.

3. పింగళి మాదయ్య:—ఇతడు క్రీ. శ. 17 వ శతాబ్దము వాడు. క్రీ. శ. 1672 నుండి 1687 వరకు గోల్కొండరాజ్యమేలిన కుతుబ్ షా అబుల్ హసన్ (తానీషా) కు ప్రధాన మంత్రి. ఈతానీషా కాలముననే గోలకొండరాజ్య మంతరించెను. ఇతని కాలముననే రామదాసు కథ జరిగెను. తానీషా పిదప నిజాముగారి తాతే గోల్కొండ రాజ్యమేలెను. వరుసకు తమ్ముడగు అక్కన్నను సేనాపతిగా నియమించుకొనెను. బందరులోనుండిన పోర్చుగీసులు యితనికి నజరానాచెల్లించి దయసంపాదించి గోలకొండనవాబగు తానీషానుండి నూనావాయు నాణెములు ముద్రించుటకు సర్వాధికారమును బొందిరి. ఇతడును పల్నాటిలోని పింగళి (పిన్నలి)కి చెందినవాడు. ఈముగ్గురి వివరములకు విమర్శకశిరోమణి శ్రీ కోన వేంకటరాయశర్మగారు రచించిన "దండనాథు" లను గ్రంథము చూడవలెను. తెలంగాణమునకు మరాటావాడకు మధ్య బీదరుజిల్లాలో పింగళి యనుగ్రామము కలదట. కాని పింగళి సూరనగారి యభిజన గ్రామమగు పింగలి యగ్రామమనుట కాధారములులేవు. సూరనగారిది గౌతమగోత్రము పిన్నలివారిది భారద్వాజస గోత్రము కాని పిన్నలిలో కాలవాసియను నింటిపేరుగల [illegible] గౌతమగోత్రులు కలరు. పూర్వము వారింటిపేరు

పిన్నలియనియు. వారిపూర్వులలో నొకడు భూమికొలతయందు వాసికెక్కుటచే కొలవాసి యనుపేరు పౌరుషనామధేయముగ వచ్చెననియు వారనెదరు. సూరనయు నతని తండ్రి తాతలు నంద్యాల ప్రాంతమునందే నివసించిరి.

4. దుర్గిలోని సాధ్వీలక్ష్మి:- ఈమెస్థానం పల్నాటిలోని దుర్గి. కమ్మకులము. తండ్రి దిగుమర్తి ముసలప్పనాయుడు. భర్త చిరుమామిళ్ల వెంకానాయుడు. ఈమె కోడరికమందలి కుటుంబబాధల నోర్చెను. తనను భర్త చంపుచున్నను ప్రాణములవిడుచు సమయములోగూడ భర్తయొక్క దయనే కోరెను. ఈమెయిప్పటికిని పూజింపబడుచున్నది. ఈమెకథను సంచారిక కథకులు బొబ్బిలికథవలె చెప్పుచుందురు. ఈమెకథను లక్ష్మమ్మ శ్రీలక్ష్మమ్మ యను రెండు సినిమాలుగా చిత్రించినారు.

5. పిడుగు శంకరయ్య:- శంకరయ్యయను పురుషుడు పల్నాటిలోని గాదెవారిపల్లెవద్ద సిద్ధి (జీవసమాధి) నొందెను. అందుచేనా గ్రామమిప్పటికి సర్కారు లెక్కలలో 'శంకరాపురం సిద్ధిపాయి' యని వ్యవహరింపబడుచున్నది. అతని వంశములోని వారిలో కొన్ని వివాదములు గలిగి సమాధిమీదిరాతిని తొలగింపగా నతడు జీవించియుండెనట. అతడా వివాదముల దీర్చెనట. మరలనట్లు తొలగింపకుండుటకై నతనికోరికపై వారతని సమాధిపై స్థిరముగా గచ్చుతో కట్టుబడిచేసిరట.

6. బెల్లంకొండ సుబ్బారావుగారు:- వీరి స్వగ్రామము పల్నాటిలోని తక్కెళ్లపాడు. గురజాల, నరసరావుపేటలలో న్యాయవాదిగా నుండిరి. సుప్రసిద్ధ నటకులు. కృష్ణరాయబారములో శ్రీకృష్ణపాత్రను ధరించి ఆంధ్రదేశములోని ప్రతిష్ఠాణములోను ప్రసిద్ధికెక్కిరి.

# అనుబంధము 1
## శ్రీనాధునిచే రచింపబడిన పల్నాటి వీరచరిత్రలోని కొన్ని భాగములు.

### మంజరీ ద్విపద.

♦ సంగమేశ్వరునకు చక్కగా మ్రొక్కి
† గుర్జాలగంగను గోర్కి ప్రార్థించి
భక్తి గోగులపాటి భైరవుదలచి
మాచెర్ల చెన్నుని మదిలోనదలచి
చెన్న కేశవపాద సేవారతుండ
శ్రీనాధుడనువాడ శివభక్తియుతుడ

× × × ×

÷ కొమ్మభూమీశుండు గొబ్బునగదలె
మత్తివేములదాటి మండలేశ్వరుడు
ఘూర్జిల్లురవముతో గుమ్మడపాడు
చేరియచ్చట నిల్చి చత్రంబువిడిచి
గరికపాటికివచ్చి కాలూనకచట
కంకణంబులపల్లె కడను నాథులు
కంకణంబులుకట్టి కదలిరావేళ

---

♦ ముసి కృష్ణలోకలియు చోటగల శివలింగము
† గురజాలలోగల గంగమ్మగుడి
÷ కొమ్మరాజు అలరాజుతండ్రి. క్రీ. శ. 1183 న కల్యాణము పాలించిన నాలుగవ సోమేశ్వరుని కుమారుడు.

వట్టిభద్రులు పైడిపాటికివచ్చి
మేళ్లవాగుననిల్చి మించినవందు
కదనరంగంబున కార్యమపూడి
పుణ్యభూమిని జేరి పొందుగాదందు
అఖిలభారతములకు నాచారముగను
ఘనమైనపోతుల గావుజెల్లించి
♦ తరువాత నర్వాఖ్య తటినిలోపలను
పటుగంగధార పాఱరగిన మడుగు
పొంతకుజని వీరపుంగవులెల్ల
నిలిపిరి లింగముల్ నేమంబుతోడ

× × × ×

‡ సహాయముఖపత్రికల గామరాజు లేఖలుపంపిన కొండలు

రాజాలు

---

మాచుగుండ్లముకోట మను జేశువరుడు
ధరణికోట పురిని దక్షుడైవట్టి
భీమదేవుండను పృథ్వీశవరుడు
ఉరగశేఖరుండను యుర్వీశవరుడు
వెదబాహుభూపతి భీమసేనులకు

---

♦ నాగులేరు.

‡ ఈ రాజుల కాలమును విపులముగా చర్చించి శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారు పల్నాటి యుద్ధకాలమును నిర్ణయించిరి.

సూర్యకుమారాఖ్య చోళరాజునకును
సంగ్రామ విజయుడౌ జయదేవునకును
జయసింగ నృపతికి చంద్రాధిపతికి
ప్రాభవాఢ్యుడు వీరభల్లాణునకును

× × × ×

నగరంబు వెల్వడి నలగామరాజు
దక్షిణదిశయందు దనరెడి బయల
+ దూబచెర్వనెడు సుత్తుంగభూస్థలిని
నిలిపించె గజముల నిండిన వేడ్క
కాశికి సమమైన కార్యమపూడి
రణరంగభూమిని రాజదానిల్చె
లవిమీఱ వీరభల్లాణుండువచ్చె
నొకవేయి యశ్వాల నొనర ప్రతాప
§ రుద్రుడు పంపించె రూఢ సంగతిని
ఇరువదివేలతో నేతెంచెనొడ్డ
÷ భువినేలు బలదేవ పురుషోత్తముండు
గుండమదేవుండు గోబ్బూరిరాజు
పద్మసేనుండును పరువిడివచ్చె

---

+ ఈదూబచెరువిప్పటికి గురజాలలో నున్నది.

§ వరంగల్లునేలు కాకతీయ చక్రవర్తి మొదటి ప్రతాప రుద్రుడు.

÷ ఓఢ్రదేశమునేలు గజపతి

(నలగాముని సైన్యమునకు హద్దులు)

× జువ్వలకల్లను సొగసైనపల్లె
సన్నగండ్ల యనంగ జవరనియూరు
తూరుపు దిక్కునకు తుదిమేరసుమ్ము
దక్షిణదిశహద్దు దగవివరింతు
నాగులేటికితూర్పు నలగొండకాని
చెలువైన యా వప్పిచర్ల జెలంగు
పడమటికిని హద్దు బాలచంద్రుండ
కొదమగుండ్లయనెడు గురిగ్రామమొకటి
ప్రజలమేలిమి చింతపల్లియునొకటి
ఉత్తరదిశ యెల్ల లొయ్యనగాంచు

(నలగాముని సైన్యములోని కొందరు పేరులు)

పొందుగులనేలు భూరి విక్రముడు
వీరమల్లనునట్టి విఖ్యాతుడొకడు
+ విక్రమసింహంబు వీరకామేంద్రుడు

(బాలచంద్రుని పుట్టుక సందర్భమున)

వైకుంఠ శృంగార వనములోపలను
చెన్నారు అనిమన్న చెట్టునకేగి
పలకల బావిలోపల నీరు ముంచి
చనిజమ్మి వృక్షంపు సవ్యభాగమున

---

× జూలకల్లు.
+ నలగామరాజు.

# అనుబంధము 2.

## పల్నాటిలోని కీర్తిశేషులైన యిటీవలికవులు



1. పాటిబండ గురుమూర్తి:- మాచర్లనివాసి బ్రాహ్మణుడు. నియోగి. ఋష్యశృంగోపాఖ్యానమను ప్రబంధము క్రీ. శ. 1879 న రచించి మాచర్ల వీరభద్రస్వామి కంకితమిచ్చెను. తనగ్రంథమున 'పల్లెనాటిసీమ' యనివాడెను. కొండవీటి సీమలోని పాటిబండ యితని గ్రామము

2. విద్యాశేఖర అక్కిరాజు ఉమాకాంతముగారు:- నుత్తికొండనివాసి. బ్రాహ్మణుడు, నియోగి. చెన్నపురి ప్రెసిడెన్సి కాలేజీలో నాంధ్రాధ్యాపకుడుగా నుండెను. పల్నాటి వీరచరిత్ర కథలు, షేక్సుపియరు నాటకకథలు, టిప్పుసుల్తాను (నవల), నేటికాలపు కవిత్వము మొదలగునవి రచించుటేగాక శ్రీనాథుడు రచించిన వీరచరిత్రలో బాలచంద్రుని యుద్ధభాగమును సంస్కరించి యుద్ధకాలమును నిర్ణయించుచు విపులమగు పీఠిక వ్రాసిరి.

3. జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు:- జానపాటినివాసి. వైదికుడు బ్రాహ్మణుడు. అభినవసరస్వతియను పత్రిక నడపెను. నాగరఖండము, స్వర్ణకార వ్యవహారమను పద్యకావ్యములు రచించెను.

4 కన్నెగంటి ప్రభులింగాచార్యులు:- తక్కెళ్లపాడు నివాసి. విశ్వబ్రాహ్మణుడు. అష్టావధాని. పల్నాటివీరచరిత్ర నాటకము జయప్రదనాటకము నీలకంఠేశ్వరశతకము, పోతనచరిత్రయను పద్యకావ్యము మున్నగు గ్రంథములు రచించెను.

5. సూరపరాజు వేంకటరమణయ్య:- మాచర్ల నివాసి. బ్రాహ్మణుడు యాజ్ఞవల్క్యుడు. భైష్మీపరిణయమును, తారాశశాంక నాటకము వ్రాసెను.

6. పిన్నలి నాగయ్య:- గురజాల నివాసి. బ్రాహ్మణుడు వైదికుడు. సుకన్యాపరిణయమను గ్రంథమును రచించెను.

7. తిరునగరి వేంకటనరససూరి:- గంగవర నివాసి. సాతాని. రామదేవశతకమును రచించెను.

8. తంగెడ రామకృష్ణయ్య:- మోర్జంపాడు నివాసి. బ్రాహ్మణుడు నియోగి. గౌరీపరిణయము, శివానందలహరి యాంధ్రీకరణమును రచించెను.

9. తంగెడ నరసింహారావు:- మోర్జంపాడు నివాసి. బ్రాహ్మణుడు నియోగి. [illegible] రచించెను.

10. తంగెడ లక్ష్మీకాంతకవి:- మోర్జంపాడు నివాసి. బ్రాహ్మణుడు నియోగి. సముద్రమథనము బుఱ్ఱకథ, జగన్మోహిని నాటకము యక్షగానము రచించెను.

11. కోలి కమలనాభుడు:- దాచేపల్లి నివాసి. కళావంతుడు. అంబరీషోపాఖ్యానము (పద్యకావ్యము) రచించెను.

12. దుగ్గిరాల నరసయ్యపాకయాజి:- గురజాల నివాసి. బ్రాహ్మణుడు నియోగి. భాగవతమును కందార్థ సీసములుగా రచించెను. పెద్దది. అముద్రితము.

13 నరికొండ లక్ష్మీనరసింహాకవి:- నాగులవరనివాసి భట్రాజు. తిరుపతి వేంకటేశ్వరశతకమును బెజవాడ కనకదుర్గ శతకమును రచించెను.

14. ఘటం కాంతయ్య:- వైదవివాసి. వైదికుడు. ఘట కాంతోపదేశములను వేదాంత గ్రంథమును కందార్థములుగా వ్రాసెను. రుక్మిణీపరిణయమను జంగముకథను వ్రాసెను.

15. కొండ భవానిశంకరాచార్యులు:- విశ్వ బ్రాహ్మణుడు వేమవరనివాసి. కనకదుర్గశతకము శ్రీగిరీశ్వరశతకము వీరబ్రహ్మయోగి నాటకము (యక్షగానము) వ్రాసెను.

16. చిరుమామిళ్ల సుబ్బయ్యదాసు:- ధర్మవర నివాసి. కమ్మకులము. గోపాలశతకము, రమాధిపశతకము మున్నగు నవి రచించెను.

17. గాదె లక్ష్మీపతి:- పేటసన్నిగండ్లనివాసి. బ్రాహ్మణుడు. నియోగి. భక్తచింతామణి శతకమును రచించెను.

18. బూదుగుపల్లి పురుషోత్తము:- వైదికుడు. రెంటాల నివాసి. తిరుమలేశ్వరశతకము వ్రాసెను.

19. వారణాసి లక్ష్మీనారాయణ:- పిల్లుట్లనివాసి పత్తె నగల్లిలోని శరభయ్య హైస్కూలులో తెలుగుపండితులుగ నుండిరి కొలదికాలము.

## పల్నాటిలోని ప్రస్తుత కవులు

1. కన్నెగంటి వీరభద్రాచారి:- తక్కెళ్లపాడు విశ్వబ్రాహ్మణుడు. అష్టావధాని. నవభారతము, పేదరాలు, పార్వతీపరిణయము, నందికొండచిలుక, మున్నగునవి రచించెను.

2 కన్నెగంటి లింగాచారి:- తక్కెళ్లపాడు. విశ్వబ్రాహ్మణుడు. నీలాహితశతకమును రచించెను.

వీరిద్దఱును పల్నాటిసోదరకవులందురు. గురజాలలోనుం దురు. ప్రభులింగాచారియు, వీరిద్దఱును సోదరులు.

3. పోకూరి కాశీపతి:- బొదిలవీడునివాసి. విశ్వబ్రాహ్మణుడు. గద్వాలయాస్థానకవులలో నొకడుగ కొంతకాలముండెను. సారంగధరయను త్ర్యర్థికావ్యమును, శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన హరిశ్చంద్ర ప్రబంధమును రచించెను.

4. పిన్నలి నరసింహకవి:- గురజాలనివాసి. బ్రాహ్మణుడు. వైదికుడు. గద్వాలలో గౌరవింపబడెను. భిషజ్జనియను వైద్యశాస్త్రమును పద్యకావ్యముగా రచించెను. సైంధవపరాభవనాటకము కలియుగనాటకము దండకపంచకము అన్యాపదేశ పటనము లక్ష్మీనృసింహస్తోత్ర పద్యములు మొదలగునవి రచించెను.

5. దాసరి మోసను (D. Mosses M. A.) గారు:- మాదిగ క్రిష్టియన్. సాకిన్ వెల్దుర్తి. గుంటూరు ఆంధ్రక్రిష్టియన్ కాలేజీలో లెక్చరరుగా నున్నారు. హార్ష చరిత్ర మొదలగునవి పద్యకావ్యములుగ రచించిరి. వీరిసోదరుడగు

6. దాసరి పెదజాన్:- రెంటచింతలలో నుండును. అప్ప కవీయమునకు టీకాతాత్పర్యములు వ్రాసెను. అముద్రితము.

7. సరికొండ రామచంద్రరాజు:- పాలువాయినివాసి. భట్రాజు. మట్టపల్లి నరసింహశతకమును రచించెను.

8. శానంపూడి వరదయ్య:- జూలకల్లునివాసి. బ్రాహ్మణుడు. భీమలింగేశ్వర శతకమును రచించెను.

9. దండంరాజు కేశవరావు:- పిడుగురాళ్ల నివాసి. నియోగిబ్రాహ్మణుడు. సన్యసించి స్వామి కేశవతీర్థయను నామముతో రామదర్శినియను మాసపత్రికను నడుపుచు ననేక యధ్యాత్మిక గ్రంథముల రచించిరి. తులసీదాసు రామాయణమును తెలుగున పద్యకావ్యముగా వ్రాయుచున్నారు

10. వేదాంతము శేషాచారి:- ముటుకూరు. నెమలిపురిలో నుందురు. వైష్ణవుడు. మాఘపురాణము, రామరాఘవ శతకము సూర్యనారాయణ శతకమును రచించెను.

11. తంగెడ నారాయణరావు:- తంగెడ నివాసి. బ్రాహ్మణుడు. నియోగి. వరూధిని నాటకమును రచించెను.

12. కూరపాటి కోటమరాజు:- నాగులవరము నివాసి. భట్రాజు. యల్లమందకోటీశ్వర శతకమును రచించెను.

13. శీతిరాజు రామచంద్రయ్య:- వెల్దుర్తినివాసి నియోగి. సత్యనారాయణ వ్రతమును పద్యకావ్యముగా రచించెను.

14. కొండ రాజమల్లయాచారి:- వేమవరనివాసి. విశ్వబ్రాహ్మణుడు. నలనాటకము యక్షగానముగా రచించెను.

15. కొంటాల వేంకటసీతారామయ్య:- కొంటాల నివాసి. బ్రాహ్మణుడు. నందవరీక. ఆదిశంకరుడు సంస్కృతమున రచించిన సౌందర్యలహరిని పద్యములుగా తెలుగున రచించెను.

అక్కిరాజు చంద్రమౌళి నిత్యానందముగారు మొదలగువారు.

# అనుబంధము 3.
## పల్నాటిలోని కొన్ని శాసనములు.



మాచర్ల:- 1. చెన్నకేశవాలయములో శక 1033 (A. D. 1111) శాసనము. ఇదిచాల ప్రాచీనమైనది. ఆదిత్యేశ్వరాలయమునకు బాగి చేతరాజు భూదానమిచ్చినట్లు శాసనము. దీనినకలిందు వ్రాయబడినది.

2. చంద్రవంకయొద్దనున్న జనరేలుబోడ్డు వంతెననానుకొని వాగుకు పడమరగాను రోడ్డుకు నుత్తరముగానున్న రెండవ ప్రతాపరుద్రునినాటి శక 1236 (1314 A. D) నాటి దాన శాసనము. దీనినకలిందు వ్రాయబడినది.

3. వీరభద్రాలయములోని మొట్టబండ శాసనము (A. D. 1554 నాటిది). ఇది విజయనగర సామ్రాజ్యమునాటిది. లింగాపురమను గ్రామము వీరభద్రస్వామికిచ్చిన శాసనము. దీనినకలిందు వ్రాయబడినది.

4. చంద్రవంకయొద్దనున్న చింతల రామస్వామిగుడిలోని శక 1710 (1788 A. D.) కీలక ఫాల్గుణ శు 15 నాటి శాసనము. దీనివలన పల్నాటిలో మాచర్లసీమ, గురజాలసీమ, తుమ్మకోటసీమ, కారెంపూడిసీమ, తంగెడసీమయను యైదుభాగములుండినట్లు తెలియుచున్నది.

5 చెన్నకేశవాలయములో శిథిలమయిన భాగమును బాగుచేయించినట్లు శక 1319 (A D 1397) నాటిది ముఖ

ముఖమంటప స్తంభముమీద కలదు. శక 1541 (A. D. 1619) నాటి దానశాసనముకూడ నా స్తంభమునందే కలదు.

6. మాచర్ల ముటుకూరు మధ్య శక 1171 (A. D. 1249) నాటి శాసనముకలదు.

7. గరుడ స్తంభముమీద శక 1566 (1644 A. D.) లో స్తంభము నిర్మించినట్లు శాసనము:

8. పోలేరమ్మగుడివద్దగల నొకరాతిమీద శక 1215 (1293 A. D.) న రెండవ ప్రతాపరుద్రుని కాలమున నిచ్చిన దానశాసనము.

9. తాలూకా ఆఫీసుకు వెనుకవైపున వాగుయొడ్డున పొలములో శక 1448 (1526 A. D.) కృష్ణదేవరాయలు మాచర్ల వీరభద్రస్వామికి యిష్టకామేశ్వరికి యిచ్చినభూదాన శాసనము. దీనినక లిందువ్రాయడమైనది.

10. శక 1592 సౌమ్య కార్తీక శు 15 (1670 A. D.) గోల్కొండనవాబగు అబ్దుల్లాపాదుషా (ఇతనితరువాత తానీషా యేలెను) కాలపుశాసనము మాచర్ల చెరువుకట్టమీద కలదు.

మాచర్ల చెన్నకేశవాలయములో నాగుపాముగల రాతి స్తంభముమీది శాసనము.

1. శ్రీలక్ష్మీన్యంద్విజపతిధారిణం వృషాంకం చక్రిణం సతతము.
2. మాంత్రిమార్గగాంచ । ఆదిత్వం . . శుభ్రితినయనా త్రిభూమ
3. మవ్యాదుహ్భతేశః స్వయమితి భూరిమన్యమానః॥
4. శ్రీమూంమేకం పాత్రి నిరుపమనుహామన్నథ ఇవద్వితీయం

5. శీతాంశుమృదుకరసము (త్నా) దితజనఃఅన + ర్ఘాంపుం
6. షాం ఖనిదివ మణీనా ము (ద) మభూతవి + త్యాం
గాపరిసర +
7. వంశోస్థిశశినః॥ రాజేస్మిన్ సమలంకరిష్ణు రభవత్త్రం
కాత్త్రవీర్యార్జునో
8. యోస్త్రర్వ్వేశ్మసు భస్మపుంఖితశర శ్శ్యాస్త్ర్య స్యమా
గ్గోన్ముఖాన్ హేలానిర్జితరావ
9. ణో పృథుభుజా సంరుధ్య రేవా రయ స్సప్తద్వీప
నిఖాతయూపనిచ
10. య స్సంప్రాప్తచక్రోహరేః శీతాంశువంశ మభివర్ద్ధ
యితుం రమే
11. శస్సాన్తా దివ క్షితితలే జని చాగి బేతః యోవిక్రమ
క్రమ వశీకృత
12. సర్వ్వలోకః పృథ్వీం శ్రియం సమహార ద్బలితో ద్విషత్తః॥
అనుంగుగా
13. మన్నృపోస్యసుతో గ్రజో జిమ ఘంగామ నృపస్త
మనూత్తమః తనుచ
14. రాయపదేవ సమాహ్వయః స్త్రమను చాహవమల్ల
నృపో భవత్॥
15. దోర్ద్దణ్డోర్వ్జ్జగ దాత్త్ర కారిభి రివ శ్రీశ స్సదా
నందభీ ర్వ్వేర్ద్దై ర్వ్వా చతురా
16 వనః పృథుతరైర్ద్ధర్మ్మైః క్రియా వత్త్రిభిః శ్రీంగైః
క్షోద్వహానాభి రాను

17. చరిత్రై + + గజైః పీ్రతక్షోణిపతిః కలాను చతు
18. రః పుత్రై్ర శ్చతుర్భి ర్జ్జని॥ అదితిరివ రమేశం కశ్యపా ద్విక్రమాకర్ణం (నృ) పవర మనసూ యాపుత్ర మత్రే రివాఢ్యం అజన
19. య దథ చేతస్సా్మపతిం వీర మాయ్యా్ర నయభుజవిజితా
20. రిం వీరకామక్షితిశాత్ + + + భూపతిః + +
21. + + + శ్రీధరపుత్రే్రణ భోగమాంబికానందనేన శ్రీ
22. మదాదిత్యేన మహాదేవితటాకాభిధానాయాం రాజ ధాన్యాం ప్ర
23. తిష్ఠితాయా దిత్యేశ్వరాయ గుణ పురగగనేందు సంఖ్యా
24. కనకవర్షే ఖరాభిధానే కార్తిక శుద్ధ ద్వాదశ్యాం పల్లిదేశేశ
25. తత్రయాన్తర్వర్తి నాగేశ్వర నదిపా్రగ్భాగావస్థిత సర్వ్బాయ
26. కల్యాం రాజమానేన వర్తన చతుష్టయ పరిమితాం భూమిం ప్రాదా
27. త్ ॥

1. కన్నడ నాగిమయ్యాభిధాన వే + +
2. + + ధానగ్రామే సప్తతి నివర్తన (న)
3. పరిమితాం పా్రదాత్ పుణ్యాశా + +
4. + + + మహాదేవితటాక
5. చంద్రభాగానదీప్రదేశే ఆతుకూరి
6. మార్గసమీపే దశ నివర్తన పరిమి

7. తాం పాదాత్ పాయుంబ్రోలా
8. భిధాన కంబముపా (ట్య) భిదానే గా (మే)
9. అష్టనివర్తన పరిమితాం ప్రాదాత్
10. ఏతా స్థలవృత్తయ అష్టభోగోప + +
11. ౧ + నదేవే + + ణోపభోజ్యాః అత్ర స
12. (ర్వ్వ) బాధాధ్యాః రాజభిరపి రక్షణీయాః
13. + + విషయస్థి తాధికారిభి రంగులిభి ర +
14. (పి) నిరూపణీయాః అత్ర కంబము
15. పాడుగ్రామే ఆదితటాక దక్షిణ (భాగే)
16. ఆదిత్యనిర్మ్మిత దేవప్రాసాదాయ
17. (నా) వోజ పోతోజ తిపోజ నా
18. మ్నా, శిల్పికాచార్య్యాయ దేవప్రతి
19. ష్టావేలాయాం సిన్ధుమాన్యరూ
20. పతయా నివర్త్తన షష్టి పరిమి
21. తాం ప్రాదాత్ ॥ బ్రహ్మ బ్రహ్మగురుః ॥

ఇది ప్రాచీనమైనది. ముఖ్యమైనది. దీని తేదీ శాలివాహనశక 1033. గుణపుర గగనేందు సంఖ్య. (గుణము త్రిగుణములు 3, పురము త్రిపురములు 3, గగనము శూన్యసంఖ్య 0. ఇందు అనగా చంద్రుడు 1. దీనిని త్రిప్పి చదువవలెను. 1033 అగును). దానికి 78 కలుపగా క్రీస్తుశకము 1111 సంవత్సరము ఖరనామసంవత్సర కార్తీకశుద్ధ ద్వాదశి. పల్లిదేశమనగా పల్నాడు. మహాదేవితటాక మనగా మాచెర్ల. చంద్ర

భాగానది యనగా చంద్రవంక. నాగేశ్వరనది యనగా నాగు లేరు. నాగులేటికి తూర్పునగల సబ్బియపల్లి (ఆగ్రామమి ప్పుడులేదు) యను గ్రామములోను ఆతుకూరిగ్రామములోను కంభముపాడు గ్రామములోను కొంతభూమిని శ్రీధరునికుమా రుడగు నొకయాదిత్యునిచే (చాళుక్యవంశపు రాజులకు ఆదిత్య యనుబిరుదు పేరునకు చివర యుండును. అట్టిరాజులలోనొకడు) నిర్మింపబడిన శివాలయమునకు, చాగిబేతరాజనువాడు భూదా నము చేసినట్లున్నది. కార్తవీర్యునివంశములో పుట్టిన చాగిబేత రాజు అతనిపుత్రుడు-అనుంగుగాముడు-అతనిపుత్రుడు-కామన్ను పుడు (వీరకాముడు)-అతని కుమారుడు బేతరాజు భూదానము చేసినట్లున్నది. పల్నాటి వీరచరిత్రలోని అలుగురాజు (ఇతనికి అనుగురాజు అను నామాంతరముకలదు) యొక్క-తండ్రి పేరు వీరకామేంద్రుడని ఉమాకాంతముగారి పీఠికలో నున్నది. అలుగురాజు కుమారుడగు నలగామరాజును వీరకామేంద్రుడని శ్రీనాథుడు పాడినాడు. తాతపేరు మనుమనికి పెట్టు ఆచారము న్నది. కావున ఈ చాగి బేతరాజే పల్నాటి వీరచరిత్రలోని అలుగురాజై యుండును. నివర్తనపరిమితమనగా యిప్పటి యొకరములవలె భూమికొలత మానమై యుండును. కన్నడ నాగిమయ్య కన్నడదేశస్థుడైయుండును. శాసనపు లిపికూడ కన్నడలిపిని బోలియున్నది. ఈ శాసనమునకు పిమ్మట రమా రమి 70 సంవత్సరములకు పల్నాటియుద్ధము జరిగినది. దీనిలిపి తెలుగేయైనను 12 వ శతాబ్దపులిపికావున యిప్పటి అక్షరముల

పోలికగా నుండదు. ఈ యాదిత్యేశ్వరాలయము చెన్నకేశ
వాలయ ప్రాకారములో నున్నది. దీని నిటీవల కర్నాటి హను
మంతు యను వైశ్యుడు బాగుచేయించెను.

మాచెర్ల వీరభద్రాలయములో తూర్పువైపున నున్న
రొల్లరాతిబండమీాది శాసనము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షంబులు
(శక 1476-1554 A. D.)

విజ ఆనందసంవత్సరములు మాచర్ల యిష్టకామేశ్వరి
కిన్ని వీరభద్రేశ్వరునకున్ను గాయిగోవాన ఖడ్గనారాయణ
బిరుదాంకిత ప్రశస్తులై శ్వేతచ్ఛత్రాధీశ్వర రేచెర్ల గోత్ర
పవిత్రులైన వెలిగోటి......మనాయనింగారి ప్రపౌత్రులై
తిమ్మానాయనింగారి పౌత్రులై బ...నాయనింగారి పుత్రులైన
కొమారి తిమ్మానాయనింగారి అర్థాంగి లింగాంబ దంఢంబెట్టి
యిచ్చిన శాసనము.

శ్రీమద్రాజ మార్తాండరాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప
సదాశివరాయదేవ మహారాజులుంగారు పృథ్వీరాజ్యం చేయు
చుండంగాను శ్రీమన్మహామండలేశ్వర రామరాజు తిరుమల
జయదేవ మహారాజులుంగారు కుమార తిమ్మానాయనింగారి
నాయంకరానకు పాలించి యిచ్చిన నాగార్జునకొండసీమలోని
మాచెర్లకు ఉత్తరభాగాన చంద్రభాగానదికి పడమర సం॥ కి
రు నాలుపుట్ల పండుం క్షేత్రముపాలిచ్చే లింగాపురమనెడి
అగ్రహారము కట్టించి యిసోమగ్రహణ పుణ్యకాలమందుల
గంగాగర్భమందుల ధారాపూర్వకంగాను సమర్పిస్తిమి గనుక

ఆలింగాపురాన నలుదరి పొలాలు హేమకూప తటాక నిధి నిక్షేప జలపాషాణ ఆగామిసిద్ధి సాధ్యాలు అనెడి అష్టభోగ తేజస్వామ్యాలు సమర్పిస్తిమిగాన ఆలింగాపురమందుల పొలము ఆచంద్రార్క స్థాయిగాను అంగరంగ వైభవాలకు అవధరించి ఆగ్రామదేవరకు ఎవ్వరు ఇయ్యకపోయినా గంగా గర్భమందు గోబ్రాహ్మణ హత్యచేసిన పాపానపోతారు. వారణాసిలో తలిదండ్రుల జంపిన పాపానపోతారు.

శ్లో॥ ఏకైవ భగినీలోకే ఏషామేవ భూభుజాం
నభోగ్యా నకరగ్రాహ్యా దేవదత్తా వసుంధరా

"క్షేత్రము పాలిచ్చుటయనగా యాపొలమును వ్యవసాయము చేయుటకు కావలసిన విత్తనములు కావచ్చును. ఇది మాచర్ల డి. నె. 792రు 1246 యకరముల 6 సెంట్లు. ఈశాసనము ననుసరించి ఆదేవాలయ కైంకర్యమునకు యిప్పటికిని వినియోగపడుచున్నది."

మాచర్లకు తూర్పున చంద్రవంకనెంబడి పడమరను జనరల్ రోడ్డు వంతెనకు వాయవ్యమున పాడుపడినగుడి వెంబడియున్న శాసనము.

"కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజులు సుఖముగా వినోదంబున పృథివీరాజ్యం చేయుచుండంగాను... శక 1236 (1314 A. D) అగు ఆనంద......మాచమనాయనింగారి.... దేవరనాయనింగారు మహాదేవిచెఱు సుఖాన పాలించుచు తమకు పుణ్యముకుగాను ధారాపూర్వకముగా సమర్పిస్తిమి."

ఇతడు రెండవ ప్రతాపరుద్రుడు.

మాచర్ల తాలూకా ఆఫీసుకు త్తరముగా వాగుయొ ద్దున పొలములో నిలువుగాపాతిన మెట్టురాతిమీాది శాసనము.

"శక 1448 అగు నేటి వ్యయసం॥ క్రిష్ణరాయదేవ మహా రాజులు పృధ్వీరాజ్యం చేయుచుండంగాను... కార్యకర్తలైన కూనమనాయని కుమారుడు కోనపనాయనింగారు నాగార్జున కొండసీమలోని మాచర్లను పురితూర్పున......ముత్తినేని తోండడు యిష్టకామేశ్వరునికి వీరేశ్వరునికి అమృతపడి కూర గాయలు పూజపుష్పాలకు త్రియంబక...గాను ధారాపూర్వ కంగా సమర్పిస్తిమి." ఇది 1526 A. D. లో కృష్ణదేవరాయల కాలమునాటి శాసనము.

సింగరుట్ల:-సింగరుట్ల అడవిలో శక 1240 (A D. 1318) నాటి శాసనముకలదు.

దుగ్గి:- గోపాలస్వామిగుడి యుత్తర ప్రాకారమువద్ద ధాతిమీాద 1219 (1297 A. D.) రెండవ ప్రతాపరుద్రుని కాలమునాటి దానశాసనము కలదు.

వరంగల్లు సామ్రాజ్యమునకు రుద్రమదేవి రాణిగా నుండి ఈప్రాంతమున జన్నిగదేవరాజు గవర్నరుగనుండిన శక 1191 (1269 A. D.) శుక్లనామ సంవత్సరమునాటి శాసనము. పైశాసనమునకు దగ్గరగనే యొక పెద్దరాతిమీాద కలదు. వెంకటేశ్వరస్వామివారి యాలయములోని స్తంభముపైన శక 1180 (A. D. 1258) నాటిది. కాకతీయ గణపతిదేవుని కాలమునాటి దానశాసనము కలదు.

కాలమునాటి దానశాసనము కలదు.

బుగ్గకు ఉత్తరముగా మూడుమైళ్ళ దూరమునగల గుడిలో రెండవప్రతాపరుద్రుని కాలమునాటి శక 1240 (1318 A D.) శాసనము కలదు.

చింతపల్లి:- రెండవ ప్రతాపరుద్రుని కాలమునాటి దానశాసనములు రెండు శక 1224 (A. D 1302) నాటిది శక 1226 (1304 A. D) నాటిది శివాలయములోని యొక రాతిపైన నిరువైపుల కలవు. శక 1674 (1752 A. D.) నాటిది హనుమంతునిగుడి కట్టబడినట్లు యొకశాసనము కలదు.

దాచేపల్లి:- 14 వ శతాబ్దమున కొండవీటి రెడ్డిరాజులచే కట్టబడినదని చెప్పబడు పాడుబడిన కోటగలదు. కల్యాణమంటపమునకు దగ్గరగానున్న యొకరాతిపైన (నాగేశ్వరస్వామిగుడిలో) త్రిపురాంతకదేవుని ప్రధాన మంత్రియొక్క కుమారులచే చేయబడిన దానశాసనము శక 1135 (1213 A. D.) నాటిది కలదు.

శక 1177 (1255 A. D) నాటిశాసన మొకరాతి స్తంభముమీద కలదు. రెండవ ప్రతాపరుద్రుని మంత్రి నువ్వులమాచిరాజు గ్రామపుశిస్తులను దేవాలయమునకు దానముచేసెను. కృష్ణదేవరాయల కాలములో శక 1440 (A. D. 1518 అనగా రాయచూరి ప్రాంతమును గెలిచిన రెండుసంవత్సరములకు) నాటి దానశాసనము నందిమండపమునకు దక్షిణముగానున్న గాలిమీద కలదు.

ముఖమంటపమునకు బయట చిన్నరాతిమీద కాకతీయ రెండవ ప్రతాపరుద్రునినాటి శక 1219 (1297 A. D.) నాటి శాసనము కలదు. అదే ముఖమంటపముయొక్క పెద్ద రాతిపైన కాకతీయ గణపతిదేవుని గవర్నరగు గంగయ్యచే చేయబడిన దానశాసనము శక 1173 (A. D. 1251) విరోధికృతు నాటిది కలదు.

ఊరిమధ్య దేవాలయములో రెండవ ప్రతాపరుద్రుని యుద్యోగస్థుడు శక 1219 (1297 A. D.) హేవిళంబి సం॥ లో నిచ్చిన దానశాసనము. రుద్రమదేవి కాలములో శక 1191 (1269 A. D.)న నొక కరణమిచ్చిన దానశాసన మొకటి. గణపతిదేవునికాలములో శక 1180 (A. D. 1258) కాళయుక్తి నాటి దానశాసనమును శక 1179 (1259 A. D.) పింగళ సం॥ దానశాసనములును కలవు.

గోలి:- గోలినుండి త్రవ్వబడిన బౌద్ధశిలా ఫలకములలో వెస్సంతరునికథ చెన్నపురి చిత్రవస్తు కళాశాలలో నున్నది. వెస్సంతరుడనగా బుద్ధుని పూర్వజన్మలలో నొకడగు వైశ్య కుమారుడు. దానశీలుడు. తనకున్న సర్వస్వమునేకాక తుదకు తన భార్యనుకూడ దానమిచ్చెను.

కొండవీటి రాజ్యములో నాగార్జునకొండ సీమలో 150 గ్రామములు.

| సముతు | గ్రామములసంఖ్య | సీమపెత్తనదారు |
|---|---|---|
| మాచెర్ల | 64 | సూరపరాజవారు |

| | | |
|---|---|---|
| కారెంపూడి | 12 | కందుకూరివారు |
| తుమృకోడు | 12 | డిటో |
| గురిజాల | 16 | దుగ్గరాజువారు |
| తంగెడ | 46 | తుమ్మలచెర్వువారు |

ఆంజనేయుని గుడిలో శక 1547 (A. D. 1625) నాటి శాసనముకలదు దానివద్దనే శక 1577 (1655 A D.) నాటి శాసనమింకొకటి కలదు ఇచ్చట పాళీభాషలోని శాసనములు కొన్నికలవు. బౌద్ధులకాలమున నిక్కడ యొకస్తూపముండెడిది. నాగార్జునకొండ స్తూపముకంటె అదిచిన్నది. దాని వ్యాసము అడుగులు. ఎత్తు 8 అడుగులుండెను.

గుర్లపాడు:- శివవిష్ణు ఆలయములకు తూర్పున శక 1243 (1321 A D) నాటి దానశాసనముకలదు. 1175 శక 1115 A D. వేదికల శిథిలమగు శాసనము గ్రామమునకు పడమర కలదు.

గురజాల:- వీరభద్రస్వామి గుడిలోని నాగుపాముల బొమ్మలుగల శాసనముగూర్చి శ్రీచిలుకూరి వీరభద్రరావుగారి యాంధ్రులచరిత్రలో నిట్లున్నది.

“బిరుదాంకరుద్రుడను నామాంతరముగల చాగి బేత రాజు పల్నాటికి ప్రభువై భూలోకమల్లునకు కప్పము కట్టుచుండెను. ఇతడు హైహయవంశజుడు. ఈ రాజు కామునూరు వాస్తవ్యుడును ఋగ్వేదపారగుడుగు నొక బ్రాహ్మణునిచే మాధవీపురము (గురజాల) లో ప్రతిష్ఠింపబడిన త్రిమూర్తి దేవాలయ

మునకు శాలివాహనశక 1051 సౌమ్య సం॥ (1129-30 A. D.) దానశాసనము వ్రాయించెను. ఈశాసనము వ్రాయబడిన నాగస్తంభముకూడ ఆకాలమునందే ప్రతిష్ఠింపబడినది. ఈశాసనములోని మొదటి రెండుశ్లోకములలో శేషుడు వాసుకి, తక్షకుడు, కర్కోటకుడు, అబ్జుడు, మహాంబుజుడు, శంఖధరుడు కులికుడు యనెడు యష్టనాగముల ప్రార్థన కలదు."

ఈ త్రిమూర్తి దేవాలయము కోటగడ్డలలోని శిధిలమయిన ముక్కంటిదేవాలయములోనిదై యుండును.

కోటసానిబావివద్ద చిన్నరాతిమీద పాళీభాషలోనిశాసనము బౌద్ధయుగమునాటిది కలదు. చోళులకాలమున కట్టబడినదని చెప్పబడుచు కాలినగురిజాల యిష్టకామేశ హారా యని శ్రీనాధునిచే చాటుపద్యము చెప్పబడిన యిష్టకామేశ్వరాలయము కలదు. గురజాలలో రహదారి బాగళాకు వెనుకవైపున పొలములో పాళీభాషలోగల శాసనము (రెండువేల సంవత్సరముల క్రిందటిది) ఉండెడిది. దానినిప్పుడు గురజాల తాలూకా ఆఫీసులో నుంచినారు.

పల్నాటివీరుల కోటయని చెప్పబడు ప్రదేశముకలదు. దీనినిప్పుడు కోటగడ్డలందురు. ఇది యిప్పుడు శ్మశానముగా వాడబడుచున్నది. "ముక్కంటి" గుడియని పిలువబడు పాడుపడిన శివాలయమిందు కలదు. ఇది కోటమధ్యనున్నది. కోటలోని వారిందు పూజచేయుచుండువారట.

వీరభద్రాలయము (వీరేశ్వరాలయము) రాజరాజ

నరేంద్రుని కాలమున కట్టబడినదని యందురు. అందు తిరుమల దేవరాయని కాలమునాటి శిధిలమగు శాసనము నాగుపాము బొమ్మగల రాతి స్తంభముమీద కలదు. ఆగుడిలోనే ధ్వజస్తంభమువద్ద శక 1470 (1548 A. D) లో గురిందలసీమ గురిందల (గురజాల) లో వీరభద్రునికి భూదానమిచ్చినట్లు శాసనమున్నది. దాని నకలిందు వ్రాయడమైనది.

ఆర్కాటునవాబు కొలువులోనున్న పోర్చుగీసు ఉద్యోగియొకని యిద్దఱుపిల్లల సమాధులు యిష్టకామేశ్వరాలయము వద్దగల స్మశానములో కలవు.

పాతపాటమ్మగుడిలోని శాసనమువలన 1823 A. D. ప్రాంతమున గుంటూరు జిల్లాకలెక్టరు ఓక్సుదొర పాతపాటమ్మ గుడికి ఈనాము యిచ్చినట్లు తెలియుచున్నది.

గురజాల వీరభద్రస్వామి యాలయములో ధ్వజస్తంభము నెంబడిగల శాసనము.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శకవర్షంబులు 1470 (1548 A. D.) అగు......సంవత్సర నందరాజ రామయదేవ మహారాజులుంగారు......గురిందల గురిందలసీమ... దేవబ్రాహ్మణుల కిచ్చిన ధర్మం......మాన్యంగాను సమర్పిస్తిమి గాన... చంద్రార్కంగాను అనుభవించు...

రామయదేవుడనగా విజయనగరరాజ్యమేలిన రామరాజు.

ఈవీరభద్రాలయ శిఖరమును ఇటీవల ప్రఖ్యాత నటకుడును న్యాయవాదియునగు కీర్తిశేషులగు బెల్లంకొండ సుబ్బారావుగారు బాగుచేయించిరి.

గురిజాల వీరభద్రాలయములో నాగుపాము బొమ్మలు గల నిలువురాతి స్తంభముమీది యక్షరములు సరిగా కన్పించుటలేదు. తిరుమలరాయని (1567 A. D. మొదలు 1577 వఱకు రాజ్యమేలెను). పేరుమాత్రము కన్పించుచున్నది.

కంభముపాడు:- మాచర్లకు పోవు త్రోవకు ఉత్తరముగా శక 1549 (1627 A. D.) నాటి భూదానశాసనము కలదు.

ముటుకూరు:- గ్రామమునకు తూర్పుగాగల సీతారామస్వామి గుడిలో నొకరాతిపైన శక 1576 (A. D. 1654) నాటిది శిధిలమగు శాసనము కలదు.

నడికూడె:- పాడుపడిన దేవాలయములో శక 1134 (1212 A. D.) నాటి దానశాసనమున్నది.

ఒప్పిచర్ల:- బావివద్దనున్న పాడుపడిన దేవాలయములో శక 1221 (A. D 1299) రెండవ ప్రతాపరుద్రునినాటి దాన శాసనము కలదు. దేవతలబావియని పిలువబడు బావివద్ద శక 1233 (A D. 1311) నాటి శాసనము కలదు. ఒకబావిని త్రవ్వించినట్లు శక 1560 (A. D. 1638) నాటి శాసనము కలదు. దేవాలయమున కిచ్చిన దానమువిషయమై శక 1541 (A. D. 1619) నాటి శాసనము కలదు.

ఊరికి తూర్పుగా ఒకబావివద్ద రెండవ ప్రతాపరుద్రుని శాసనములు రెండు ఉన్నవి. ఒకటి శక 1233 (1311 A. D.) రెండవది శక 1221 (A. D. 1299) నాటిది.

పట్లవీడు:- ఊరికి అరమైలుదూరమునగల రాతిమీద

శాసనము శక 1440 (1518 A. D.) నాటిది శ్రీకృష్ణదేవ రాయలు పట్లవీడుశివారు రామడకను మాచెర్లచెన్నకేశవుని కిచ్చినట్లు శాసనము. (ఈ ప్రాంతమును గెలిచిన రెండుసం వత్సరములకు)

పట్లవీడువద్దగల కృష్ణదేవరాయని శాసనము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు కృష్ణవః సంగడు 1440 (A. D 1518) బహుధాన్యనామ సం॥ వైశాఖ సు 15 మహారాజశ్రీ రాజాధిరాజ మహీవర శ్రీవీర ప్రతాప కృష్ణరాయలు పృథివీరాజ్యం శాయంగాను యల్లవి నాయంకరు ముక్కర తిమ్మరసు నాయంకరు మాచెర్ల చెన్న కేశవదేవర అమృతపడి నయివేద్య అంగరంగ వైభవాలకు మనిచె భూదాన ధర్మశాసనపత్రం కృష్ణరాయ మహారాయ నాయంకరు నాగార్జునకొండసీమ రామడక గ్రామానువారి రాగ...పుణ్యకాలమున కృష్ణవేణి తిరుణోత్సవవర్త ఏక్య నాథ సన్నిధియందు దానము పూర్వకముగా కృష్ణరాయ మహారాయలకు పుణ్యంగాను ధారపోసి సమర్పిస్తిమి. ఆగ్రామ మందలి చతుర్సీమాలు దానాదిత్యాగజలవాహిని అందు మాచర్ల చెన్నకేశవదేవర అమృతపడి నయివేద్యం అంగరంగ వయిభవ గ్రామముకొండ ఆచంద్రార్క స్థాయిగాను స్వామి మాచర్ల చెన్నకేశవదేవ చరిపించి నైవేద్య అంగరంగవయిభ వముమల్లప్పనాయంకరు తిమ్మనాయంకరు అనుభవించేది. తిమ్మప్పనాయంకరు సమర్పించినది స్వదత్తా ద్విగుణం పుణ్యం...

పెదగార్లపాడు:- దేవాలయమునందున్న శక 1695 (A.D. 1773) నాటి శాసనము. ఆదేవాలయమును బాగుచేసినట్లున్నది.

పిడుగురాళ్ల:- రహదారి బంగళావద్దనున్న పాడుపడిన కృష్ణాలయములో నున్నది. ఆదేవాలయమును శక 1472 (1550 A. D.) లో బాగుచేయించినట్లుగల శాసనము.

శ్రీగిరిపాడు:- శక 1220 (1298 A D) నాటి శాసనమొకటి కలదు. చోళులకాలమున కట్టబడినదని చెప్పబడు శివాలయము కలదు.

తంగెడ:- పాడుపడిన కోటయు ఆకోటలో పాడుపడిన 16 దేవాలయములు కలవు. శక 1294 (A D. 1372) నాటిది కొండవీటినేలు అలియ వేమారెడ్డియొక్క శాసనము కలదు. శక 1474 (1552 A D.) నాటి దానశాసనము దుర్గగుడికి పడమరగా కలదు. ఇది విజయనగరరాజులనాటి శాసనము. ఇందు రామరాజ, రామదేవ, తిరుమలదేవుల పేరులు కలవు. తంగెడ కోటను ఉప్పల (అనుముల) కోటిరెడ్డి యనునతను కట్టించినట్లు తెలియుచున్నది.

తేరాల:- సిద్ధేశ్వరస్వామి గుడిలో శక 1165 (A. D. 1243) నాటి దానశాసనము కలదు. ఇంకొకరాతిమీద శక 1366 (1444 A. D) నాటి దానశాసనము కలదు.

పొందుగుల:- శక 1672 (1750 A. D) లో విపరీతమైన వరదలు కృష్ణానదిలో వచ్చినట్లు ఒకశాసనమున్నది.

తుమ్మురుకోడు:- ఇచ్చటనొక పెద్దమశీదు కలదు. 1766, 1773, 1774, 1778 లో చనిపోయిన ఆంగ్లేయ సైనికోద్యోగుల సమాధులు కలవు. కొన్ని కాలమందలి ఆర్కాటు నవాబగుమహమ్మదాలీ పేరుకూడ యిందునమోదుకాబడినది. ఈ ప్రాంతములోజరిగిన యొకయుద్ధములో చనిపోయిన ఫ్రెంచి యింగ్లీషుసైనికుల సమాధులుకూడ కలవు.

వెల్దుర్తి:- సహగమనముచేసి సతీత్వమునొందిన స్త్రీల గూర్చి రెండుశిలలు కలవు. శక 1087 (1165 A.D.) నాటిది చదువుటకు వీలులేని శిధిలమగు శాసనమొకటి కలదు.

1. కారెమపూడి:- శక 1536 (1614 A. D.) న నొక స్తంభమునునిర్మించినట్లు వీరులగుడుల మంటపమునకు దక్షిణముగానున్న నొకరాతిమీద శాసనము.

2. ఆగుడియొక్క తూర్పుప్రాకారమునకు దగ్గరనున్న నొకరాతిమీద శక 1318 (1396 A D.) నాటి శాసనము.

3. ఆగుడియొక్క ధ్వజస్తంభమునకువెనుక చిన్నమండపమునకు తూర్పుగానున్న యొకరాతిమీద శక 1246 (1324 A. D.) నాటి శాసనము.

4. ఆగుడియొక్క ముఖమండపముయొక్క స్తంభముమీద నామండపనిర్మాణముగూర్చి శక 1255 (1333 A. D.) నాటి శాసనము.

5. ఊరిలో విష్ణుగుడి బయటిప్రాకారములోగల రాతిమీద శక 1549 (1627 A D.) నాటి శాసనము. పల్నాటి

వీరులచేత కట్టబడిన యీగుడిని యీసంవత్సరములో నొక నాయుడు బాగుచేయించినట్లుగల శాసనము.

6. సూరేశ్వరస్వామి గుడియొక్క ముఖమండపపు స్తంభముమీద శక 1186 (1264 A. D) నాటిది రుద్రమదేవి యొక్క గవర్నరగు జన్నిగదేవమహారాజులు యిచ్చి దాన శాసనము.

7. ఆగుడియొక్క యింకొక స్తంభముమీద రెండవ ప్రతాపరుద్రుని కాలమున శక 1239 (1317 A.D.) నాటి దానశాసనము. అందులోనే మఱియొక స్తంభముమీద శక 1227 (A. D. 1305) రెండవ ప్రతాపరుద్రుని కాలము నాటి శాసనము.

8. శక 1076 (1154 A. D.) కులోత్తుంగచోళుని ప్రధాన మంత్రి దీపారాధనకిచ్చిన భూదానశాసనము. సూరేశ్వరస్వామి గుడిలో తూర్పుప్రాకారములోనున్న రాతిమీదకలదు.

9. రెండవ ప్రతాపరుద్రుని పేరు నమోదుచేయుచు శక 1225 (A D. 1303) నాటి శాసనము ఒక స్తంభముమీద కలదు.

10. శక 1229 (1307 A. D.) న శ్రీమతుమాంచయ నాయనింగారి పుణ్యమునకుగాను వారి అడపం పోచూలెంకం గారు సూరేశ్వరదేవరగుడికి సున్నమువెట్టించినట్లు శాసనము.

అమీనాబాదు శాసనము.

ఉ॥ ఘాటిగనేగి యుద్ధగిరి దార్కొని వేంకటరాజుదోలి ము౦
గోటలు లగ్గబట్టి వినుకొండయు బెల్లముకొండ తాగెసల్

పాటిపరిన్ హరించి మఱి బల్మినిగైకొని కొండవీడు క
ర్ణాటకరాజధాని నిభరాముడు బాహుబలంబుమీఱుచున్

గోల్కొండ నవాబగు మహమ్మద్ ఖులీ కుతుబ్ శా యొక్క మంత్రియగు అమీనుముల్కు క్రీ. శ. 1592-93 న యీశాసనము వ్రాయించెను. ఈ అమీన్ ముల్కు-యే పొన్నిగంటి తెలగనార్యునిచే యయాతిచరిత్రము సంకితముగాంచిన యమీనుఖాను. పల్నాటిలోని పెందోటకు ప్రభువగు మార్కండేయుడీ కుతుబ్ శాహికి సామంతుడుగ నుండెను. ఈశాసనములో శక 1502 విక్రమసం॥ (క్రీ. శ. 1580) చైత్ర బ 14 భౌమవారమున్నాడు బయలువెడలి గోల్కొండ నవాబయు, ఖులీకుతుబ్ శాహికి తండ్రియుయగు యిబ్రహీం కుతుబ్ షా (ఇభరాముడు) కొండవీటిని గెలిచినట్లున్నది. ఈ ఇబ్రహీం కుతుబ్ షా, అద్దంకి గంగాధరకవిచే రచింపబడిన తపతీసంవరణోపాఖ్యానమును కృతినొందెను. ఈశాసనము వలన 16 వ శతాబ్దాంతమున వినుకొండ, బెల్లముకొండ, తంగెడ దుర్గములు చెప్పుకొనదగిన బలముగలిగిన దుర్గములని తెలియుచున్నది. వివరములకు చిలుకూరి వీరభద్రరావుగారి యాంధ్రమహనీయులను గ్రంథము చూడనగును.

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 16 | poletical | poetical |
| 4 | 8 | పైశానము | పైశాసనము |
| 5 | 10 | యందలు | యందురు |
| 7 | 22 | memors | memoirs |
| 14 | 2 | ఉప్పల అనుములు | ఉప్పల (అనుమల) |
| 18 | 14 | కైవు | క్లైవు |
| 29 | 4 | పేర్లు | పేరు |

## అనుబంధములు

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 11 | లవిమీాలు | లలిమీాలు |
| 8 | 10 | అర్వ్యపర్యటనము | అరణ్యపర్యటనము |
| 8 | 13 | మోాస్సు | మోాసిసు |
| 10 | 3 | చేతరాజు | బేతరాజు |
| 10 | చివరపంక్తి 'ముఖ' అనునది తీసివేయుము | | |
| 13 | 11 | నకవర్ణే | సకవర్ణే |
| 14 | 14 | వరిమితాం | పరిమితాం |
| 14 | 16 | తేదీ | తేది |
| 15 | 8 | చేతరాజు | బేతరాజు |
| 18 | చివరపంక్తిని తీసివేయుము | | |